శా. ఈరీతి న్కృతమన్యుఁ డన్యముఖము♦ల్వీక్షింపఁ గాలేక స్వా
గారం బందున గారవం బుడుగ సిం♦గారంబు లే కొక్కఁడున్
దారాపత్యనిజాంఘ్రిభృత్యులను జెం♦తం జేరఁ జింతాకులా
ధీరస్వాంతముతోడఁ జేర్కొనక మం♦దీభూతుఁడై యున్నెడన్. ౫౬.

గం. అణఁకువతోడ నెప్పటి యు♦దంతము నప్పుడె విన్నవింప ను
ల్బణతరనీతిశాలి యగు♦భార్గవు పంపున గూఢవృత్తిఁ ద
త్ప్రణిధులు నాకలోకమున♦వర్తిలు వా రటు లేగి రాక్షసా
గ్రణులు వినంగ నిట్లు బలిఁ♦ గాంచి వచించిరి శుక్రు సన్నిధిన్. ౫౭.

కం. దేవా! దేవాధీశ్వరు, కావరమున కావరముని♦గణ్యుఁడు శైవాం
శావిర్భావుఁడు లసదను,భావుఁడు దుర్వాసుఁ డలిగి ♦ వడి శపియించెన్. ౫౮.

కం. ఆశాపవిధముఁ దెలిపెద, మాశాపతిసేవ్యతాభ♦వాతిశయమదా
వేశాపశదా యోదే,వేశా పరులను భజించు♦ నిఁక నీదు సిరుల్. ౫౯.

చం. అని శపియింప శక్రుఁడు ప♦దానతుఁడై క్షమియింపు మన్నచో
పని విననట్టు శాపవిని♦వృత్తి యొనర్పఁగ లేదు గాని గొ
బ్బున హరియే కలం డనుచుఁ♦ బోయె నతం డెటకేనియో గృహం
బున కరిగె న్విషాదమున♦ మున్గుచు నీతఁ డపేతమోదుఁడై. ౬౦.

కం. అని చారు లివ్విధంబుగ, వినిపించిరొ లేదొ గాని ♦ వికవిక బొత్తో
డనుమించెఁ గహకహోద్భటి, యనుగతమై రాక్షసాట్ట♦హాసము తోడన్. ౬౧.

శా. ఎట్టెట్టా మునిపంచకోడి కడక♦య్యాశాపరాకారుఁడై
తిట్టెన్ దిట్ట యనం బ్రసిద్ధుఁడగు న♦ద్దివ్యర్షి వేంచేసెనే
కట్టా యాతని గారవింపఁడె త్రిలో♦కస్వామ్యగర్వాంధుఁడై
గుట్టగ్గొట్టెడు వెట్టివాఁడు మునియుం♦ గ్రోధోగ్రుఁడై తిట్టెనే. ౬౨.

ఉ. మేలు భళీ బలిం బలిమి ♦ మించినవారల వీరులం ద్రిలో
కీలసమానమానఘన♦కీర్తివిశాలుర దానశీలురం
బోలఁగఁ జూచినారమె ఋ♦భుప్రభుసంపదఁ బెంప దక్షు లే
మూలఁగ రారు గల్గినఋ♦భుక్షుని కాపులె గాక శత్రులే. ౬౩.

కం. వారలకు మనము మనకుఁ, వారలుఁ బరుల మని యెల్ల వారికిఁ దెల్లం
బౌరాజు వైభవము మన, యీరాజుం జేర నిర్ణయించెన్ విధియుః. ౬౪.

కం. ఇది విమతుల పైకెత్తుట, కద నని కదనవియమ్మణుఁడగు భృగుజుఁడు గ
ల్పఁదగన్ బలిపీఠముపైఁ, గదలన్ గద లందికొనియెఁ గద తద్బలముల్. ౬౫.

శా. అంతం దంతుర మయ్యెఁ దేజమున నయ్యాస్థానగేహాజిరో
పాంతం బెంతయుఁ గుంతచాపపరిఘప్రాసాసిముఖ్యాయుధో
ద్వాంతాత్యంతఘనస్ఫులింగరుచిసంతానంబుతోఁ దచ్ఛమూ
కాంతానంతపరిష్క్రియాగణమణీకాంతుల్ప్రసారింపఁగన్. ౬౬.

కం. నగరి మొగసాల నపు డొన్న గరిమ నిస్సాణనిక్వణంబు చెలంగె
న్నగరిపుఁడు వసించెడున న్నగరి పయికి దాడి తత్క్షణ మని తెలుపుమన్. ౬౭.

శా. ఆసన్నాహముఁ జూచి యబ్బలియు దృప్యత్సైన్యజయోద్ధాళితో
నూసువ్యక్తబలాఢ్యులారా! వినుఁడీ యుష్మద్భుజావిక్రమో
ల్లాసం బెల్ల నిగూఢవృత్తిగఁ బరుల్ భావింపలేకుండువి
న్యాసం బొప్పఁగ నేఁగుటిప్పు డుచితోపాయంబుగాఁ దొప్పెడున్. ౬౮.

గీ. అతఁడు శాపోపహతుఁడయ్యె నతని శాప, ముపశమనసాధనమిదియని మునివచింపఁ
డయ్యె నిఁక నేమిమునకు జయంబు సిద్ధ, మంచు నెంచంగఁ జలదు తథ్యంబు గాఁగ

కం. ఏమన నీమనసేనా, సామగ్రికి దేవసైన్యసామగ్రి సముం
బై మోహరింప కసదగు, నే మతి భయమే మటంచు నేమతి యున్నే. ౭౦.

కం. హానం దడిసియని వాఁడా, మాని స్మృప్పించువాఁడు మన కెపు డేమో
గా నేరము సురపతిదనఁ, గా నేరము బుద్ధిపూర్వకమె యగు హరికిన్. ౭౧.

కం. దేవీప్రసాదలబ్ధం, బోవాచంయమియి తెచ్చెనో యెచ్చటిదో
పూవుందండ తెఱంగా, దేవేంద్రుం డెఱుఁగఁ డతనిదే యీతప్పున్. ౭౨.

గీ. ఒదవు నల్పాపరాధున కొక్కవేళ, నధికదండంబు నొకవేళ నల్పదండ
మొదవు నధికాపరాధునకదియు నిదియు, ననుభవముపట్ల నొదవు యథార్థముగనె

గీ. కాన శాపఫలం బంత కట్టి కుడుప, దెంచ శాపవిముక్తి వచించె మునియె
హరియె కలఁడంచు వజ్రికాహరియె ప్రాప, కుండు గావునఁ దరిఁ జేర్పకుండు నెట్లు.

గీ. మఱియు నాతఁడు జిష్ణుఁడ♦మర్త్యకోటి, కెల్ల నాథుఁడు నాట బా♦హిరము గాఁగ
దాడి వెడలంగఁ దగ దంచుఁ♦ దలఁతు సురలు, పట్టి చేసేతల నె గెల్వఁ♦బడెదు వారె

చం. అనవుడు శుక్రుఁ డిట్లనియె ♦ నాకరవల్లభ యెల్లభంగులన్
విను వినువీడు వీడి గిరి♦భేది కొలంగక నిల్చియుండఁ డ
మ్మునివరు శాప మెంతయు న♦మోఘము గావున నొక్కపుంటయై
నను రిపుకల్మి బల్మిఁ గొని♦నం గద బీరము శూరమూర్తికిన్. ౭౮.

తే.గీ. కోరి కైవసమొనరించు♦కొనఁగఁ దగిన, సిరి తనంత నె రానుపే♦క్షింపఁ దగునె
మది వలసి వచ్చినను మేన♦మామకూఁతు, వావి గాదంచుఁ బలికిన♦వాని కరణి.

తే.గీ. బాహిరము గాఁగ సురలపై ♦ మోహరించి, జనఁగఁ జనదనఁదగు రహ♦స్యముగ నేగి
ముట్టడించి వెనస్నహి♦ముట్టడించి, శక్రుపద మేలు పదమేలు♦సమయ మిదియె.

కం. అని బోధించి పురందరు, నని సాధించి జయమూన ♦ నభిమత మనుచున్
దనుజాగ్రణి మది మురమొం, దనుజాగ్రన్నిరి హేతి♦ధరతతితోడన్. ౭౯.

ఉ. గీరము మీఱి మీ రమగ♦వీరులు సారెకు భూరిసారమే
పారఁగఁ జొక్కమైన మెల ♦ పారఁగ ధీరగభీరధీరమో
దారతఁ దారతమ్యరహి♦తారభటిం దగఁ దారసిల్లి తే
దో రహిఁ దోరమై దనరు♦ గోరహిఘోరతఁ బోరితంబులన్. ౮౦.

కం. ఒకవేళఁ జయము వారల, కొకవేళ జయంబు మీకు ♦ నొదవుట గల దిం
తకు మున్నిప్పుడగుం దప్పక మీకు నతండు శాప♦భగ్నుం డగుటన్. ౮౧.

కం. ఐన సమప్రతియోధుల, పై నె త్తెడుతఱి నిగూఢ♦వర్తన మొప్పం
గాన నిశీధిని నటఁ జనఁ, గానగు నెరు లెఱుఁగకుండఁ♦గా నణఁగువతోన్. ౮౨.

మ. అని కావ్యోదితమైన పద్యమున ను♦ద్యత్ప్రాపవిన్యాసగుం
భనమత్తేభరథోత్థితాశ్వగతి శుం♦భద్విక్రమస్థానగో
పనభంగీహృదయంగమం బగుచు దే♦వద్వేషిసైన్యంబొగిం
జనియె న్నాకపురీనిరోధనసము♦త్సాహస్ఫుటాహంకృతిన్. ౮౩.

తే.గీ. నల్ల ద్రావుడు మూఁకలు ♦ నడికిరేయి, నల్లనల్లన నటరహ♦స్యమగు వృత్తి
నల్ల సుమనఃపురోపశ♦ల్యంబునందు, నల్లరి యొకింత లేకుండ♦నరిగి విడిసె. ౮౪.

సీ. అభిసారికావృత్తి ◆ నరిగి వచ్చెడువేల్పు, మించుఁబోఁడుల నడ్డ◆గించి కదిసి
ప్రోషితాయాతది◆వ్యులవిమానము లూరు, సేరకుండఁగ లాగి◆చెఱలఁ ద్రోచి
యపుడె క్రొత్తగ మింటి◆కై యేగుకర్మదే,వతల బిట్టుగ వెట్టి◆పనులఁ జొనిపి
యింద్రుఁ జూడఁగ వచ్చు◆నితరలోకర్షుల, నట్టిట్టుఁ బోనీక◆పట్టి నిలిపి

తే.గీ. యొరులు సొరలేని గడితంపు◆ పరిఖ యగుచు
వెలయు మిన్నేటి నీరెల్ల ◆వెలితిఁ బాఱఁ
గూల మందందగనుమలు ◆గొట్టి కూల్చి
ముట్టడించిరి దితిజు ల◆ప్పట్టనంబు. ౧౫.

ఉ. ఆపురిచుట్టు గొంద ఱవు◆ డావల నీవలఁ ద్రోవఁ బోవరాఁ
గుప్పలు గూడి రక్కసులు ◆ గొబ్బున నాత్మపటీకుటీతటిం
జొప్పడుచప్పరంబులఁ బ◆శుప్రకరంబుల బోయ లోయనం
దవ్వక రాటకొక్కనిగఁ◆ ద్రాటఁ బిగించిరి ఖేటకోటులన్. ౧౬.

మ. వరుసం దానవు లన్నిలింపవరు సం◆బంధంబుచే నొప్పన
మ్మరుదారామకుజంబులం దమరుదా◆మక్షౌమభూషానుతే
పగసాదుల్మణిగోహయద్విపరసా◆వాసాదులున్ వస్తుచే
సిరి వీఁకన్ ఖలకోటి కన్యసిరి వీ◆క్షింపంగఁ జూపోపునే. ౧౭.

సీ. మీఁదిమేడలపై ర◆మించునిర్జరలోక, పల్లవుల్ పైనుండి◆పైకిఁ బోవఁ
గ్రిందిమిద్దెలఁ బాన్పు◆ లందున్న రణహతా,గతరాజు లాయుధ◆ప్రతతి వెదుకఁ
బెరటిపంచలలో జ◆పించుసోమాసులు, దిడ్డిగంతల త్రోవఁ◆ దెఱచి పోవ
లోనిసావళ్లఁ బొ◆ర్లుచు నున్నయితరపు,ణ్యులమూఁక లిఱుకుసం◆దులను దూఁరఁ

తే.గీ. గహకహార్భటిఁ జెలరేఁగి◆గములుగట్టి, తెగువ నింటింటికొక్క కొంద◆ఱుగఁ గడంగి
రక్కసులకూటు వొక్కటి◆ నుక్కు మిగిలి, సురనగరి వేశవాటంబు◆ సొచ్చెనపుడు.

మ. ఇది మిథ్యమ్మని యించు కేని మది నూ◆హింపంగ రాకుండుటం
ద్రిదివౌకఃప్రకరంబు లేమి యెవరే◆ రీ యేల యీగోల య
ల్లదె యచ్చో నిదె యిందెపో యనుచు యా◆తాయాత వీతోత్తరీ
యదశం దొట్రిలఁ దల్లడిల్లె నగరం◆ బాబాల గోపాలమున్. ౧౮.

శా. ఆకోలాహల మాలకించి దివిజా•ధ్యక్షుండు రక్షోగణో
ద్రేకం బౌనిది యంచు నెంచి యనలా•ర్కప్రఖ్యదిక్పాలకా
నీకంబుం బిలిపించి యిప్పుడె సమి•న్నిస్సాణఘోషార్భటి
న్నాకానీకినులెల్లఁ గూడుకొను స•న్నాహంబు సేయుండనన్. ౯౦

సీ. సోఁకినచో నెల్ల•సురసురఁ దెగ మాడ్చు, వహ్ని యుద్యత్ప్రతా•పమున నెగడె
సకలజీవులకు నం•తకవృత్తిభయదుఁడౌ, యముఁడు మృత్యుసమేతుఁ•డగుచు నడచెఁ
బచ్చిరక్తముఁ ద్రావు•పలలాశనుండైన, నైఋతుం డతిభీష•ణతఁ గడంగెఁ
బనహారి బలిమిచే•తనె గుభాలున ముంచు, పాశి వాహినుల వెం•బడిగ నెదిరె
జగము దూలింపఁగల ప్రభం•జనుఁడు రేఁగె, భూరిసారంబు దనరు కు•బేరుఁ డేగెఁ
గంటమంటలఁ జిలుకు ము•క్కంటి గదలె, వారి వెనుకొని గీర్వాణ•వర్యుఁ డరిగె.

కం. అయ్యభియోగము గని తొలి, దయ్యపుజోదులును బాహు•దర్ప మెలర్పం
జయ్యనఁ బిఱుతివియక గడి, కయ్యమునకుఁ గాలు ద్రవ్వి•కవిసిరి కడిమిన్.

గీ. వ్యోమచరులు తొలుత దైవత•యోధు లపుడు, చదలున నెయుండి పోరికి•సంభ్రమింపఁ
గామచరులు తొలుత రాక్షస•గ్రామణులును, బలసి యుండిరి మింటనే•ప్రతిఘటించి.

శా. నేమిస్వానవిహీనమై బలరయో•గీనిర్యత్ప్రజఘ్యాన్యమై
వ్యోమగ్రప్రచరద్విమానరహితం•బై నారదారబ్ధగా
నామోదభ్రమణాదివిభ్రమవిశే•షాపేతమై వారిసం
గ్రామారంభము చూడఁ జొప్పడె నపూ•ర్వప్రక్రియావక్రమై. ౯౧

మ. సరిగా నయ్యిరువాఁగు జోదులు యథే•చ్ఛన్ డాసి వీఁకం బర
స్పరశస్త్రాస్త్రనిపాతనంబులను లే•శం బైన లో నాసి చెం
దరు బింకంబులవాసి డిందరు ప్ర•సిద్ధప్రోద్ధతిం జేసి మ్రం
దరు పొంకంబులఁ బాసి కుందరు రణో•ద్యత్సాహసోత్సాహులై. ౯౨

ఉ. ఆసమరాంగణంబున జ•యాపజయంబులు రెంటిలోన దే
వాసురు లెద్ది యెవ్వరికి•నౌను మెఱుంగఁగరాక యుండ నా
సాసలఁ జేసి గెల్పునకు•నై తగఁ బోర నదృశ్యరూపుఁడై
వాసవుఁ డున్నతావునకు•వచ్చి గురుండు వచించె నిమ్మెయిన్. ౯౩

ఉ. ఓవిబుధాగ్రణీ! యెఱుఁగ•వో! మునిశాప మమోఘ మాటచే
భావిజయంబుతో రిపుల• పాలగు నీసిరి యంచు వేగమే
యావల శ్రీవధూవరుక•టాక్షమున న్నినుఁ జేరునంచు నం
గావున సేన నిట్లువిత•గా వెతగాటియువెట్ట నేటికిన్. ౯౭.

శా. పోరం బోర నమర్త్యసేనలకు గె•ల్పుం జాల్పునన్ లేమిచే
రారా పాక్కటిమాత్ర దోఁచు నతిమా•త్రక్రూరదుర్వారదు
ష్ప్రారంభు ల్దితిజు ల్మదంగియును పీ•రస్వర్గముం జెంది యా
త్మారాళత్వము వాయ రేమి ఫలమో• వ్యర్థప్రయాసంబునన్. ౯౮.

ఉ. కావున నిప్పు డెందయినఁ• గప్పడగుండఁగఁ డాఁగి యుండి నీ
వేవిధినైనఁ గాని విధు•నే భజియించుచు నుండు మాతఁడుం
దైవతకోటిపై నెనరు• దప్పఁడు తప్పడు గంటఁ ద్రోచు దై
త్యావళి ప్రమందఁ జేయు నని• యంద ఱుతింగినచందమే కదా. ౯౯.

కం. అని తనగురుఁ డుపదేశిం,చిన విని యనిమిషవరుండు• శ్రీహరిఁ గొలువం
జని యెన్ మందరశిఖరికి, జనియించిన ధృతి స్వపక్ష•సంతుష్టుఁ డగుచున్. ౧౦౦.

శా. అంతన్ దానవసైన్యనాయకులు ప్ర•త్యర్థు ల్పటాపంచలై
యంతర్థానము నొంద నెం దరిగిరో• యంచు న్నిరూపింపలే
కెంతే మే లిదెచాలదే విముఖులై•యింద్రాదికు ల్పాఱ ని
శ్చింతం దత్పుర మాక్రమింపఁ గలిగెన్• శ్రీశంభుసంభత్ప్రపన్. ౧౦౧.

చం. మన బలిరాజుకో ల్తలక•మర్త్యులె నిల్వక పాఱి రన్నచో
మనుజు లనంగ నెంతపని• మానుషభుక్తతి నాతఁ డేలుఁ జే
ర్కొని గణుతింప నేటి కుర•గు ల్పురుగు ల్గద వాని దృష్టికిం
బనివడి కుజ్జగంబు లిట•పై నతఁ డొక్కఁడె ప్రోచుఁ జక్కఁగన్. ౧౦౨.

కం. అని సంరంభవిజృంభణ,మున స్వర్గపురప్రవేశ•మునకు ముహూర్తం
బును శుక్రుం డిడి యెదుటం, గనుపట్టం బట్టనాట్ట•గతులై రసురుల్. ౧౦౩.

గీ. పుట్టినది గోలె నసురస•మూహమునకు, నాత్తల సురాలయప్రవే•శాభిలాష
కలదు గావున నది యబ్బెఁ•గాని యప్పు, డాసనామోద మింతైన•నబ్బదయ్యె.

గీ. వేశవాటమందు ♦ విడివడి పూర్వదే,వేశభటులు చటుల♦వృత్తితోఁ బ్ర
వేశ మొనరఁ జేసి ♦ వేల్పుసానుల మదా, వేశగరిమఁ బట్టి♦ వెదకు నపుడు. ౧౧౫.

సీ. ముద్దుగుమ్మలు మేళ♦మున కేగ నింటికా,వలి యుంచు ముసలిపా♦పలును లేరు
గోవాఁడ్రతో సందు♦గొందుల గుసగుసల్, సలిపెడి తాపిక♦త్తెలును లేరు
కన్నుసన్నల వీథి♦గడపల లేబొజుం, గులనాన కొల్పుక♦స్త్రెలును లేరు
సవరింపఁదగు సను♦ల్పమకూర్పు నాడిగం,బులకుఁ జేరినబాని♦సలును లేరు
సాను లెటపోయిరో వాండ్ర♦తో నెవీఁడ్రు, దరలిరనితోఁచుఁ జెలువిన♦తలు పులెల్లఁ
దెలిచినట్లనె యుండె న♦ద్దిర యటంచు, మిగుల విసివిరి రక్కసి♦మిండ లపుడు.

సీ. పిల్లి పొర్లించి త్రా♦వినపాలకుండనా, నమృతకుండము శూన్య♦మై తనర్చె
నూనె చట్టపునేల♦నయినాఁగ సురగవి, పొదుఁగు పయోహీన♦ముగను దోఁచెఁ
జెలఁది గూండ్లిడినట్ల మాఁ♦కులువో లెఁగల్పవృ, క్షములు నిష్ఫలములై♦కాన నయ్యె
మందువేసవినాఁటి♦మడుఁగునా మిన్నేటి, యస లెండిబీటలై♦యడుగుఁజూపె
నమర నమరావతీపట్ట♦నమును విడిచి, సకల విబుధవ్రజం బుతో♦ సత్పథమునఁ
బొదలునల రాజువలస♦పోవఁదజెమి, యసురవిసరంబు విడిపడి ♦యాక్రమింప.

సీ. నందనోద్యానంబు ♦ నందనోఁకహసమూ,హం బవకేశిభా♦వంబుఁ గనుట
మందురాపుందిర♦ముందు రాజిలు తేజు, లంతేని జవశూన్య♦వృత్తి గనుట
నాలానబద్ధశుం♦డాలానవద్యసం,ఘాత ముద్వాంతవై♦ఖరిని గనుటఁ
గామయానతమించు ♦వ్యోమయానంబు లు,డ్డీనసామర్థ్యైక♦హానిఁ గనుట
నరసి నిరసించుకొని రాత్మ♦లందు వట్టి, గొడ్డు తాకట్టువిడుపఁ గై♦కొనఁగవలదు
దొంగిలింపంగఁబోయిన♦మంగలంబు, దొరకెనను మాడ్కి నంచు దై♦త్యలువిరక్తి.

చ. దితిసుతకోటు లిప్పగిది ♦ దివ్యులపట్టన మాక్రమించి య
ప్రతిహత రీతి ఖ్యాతిగల♦రాజగృహంబున రాజు నాశ్యస
మ్మత మగుమంత్రిగేహముల♦ మంత్రులు జోదుల యిండ్ల జోదు లం
చితగతిఁ దత్తదర్హము వ♦సించిరి తత్తదగారసీమలన్. ౧౧౯.

మ. అసురస్తోమము సామదానరహితం♦బై భేదదండద్వయం
బెసఁగన్ వేల్పులపట్ల ఘోర్త్యమున ను♦జ్జృంభించి యభ్యంచితా

ప్తసమూహంబుగ నింద్రుమందిరమునం దత్తత్ప్రసిద్ధప్రదే
శసమాలోకనకౌతుకం బడర సంచారంబుఁ గావించుచున్. ౧౧౦.

సీ. కట్టించుకొనినాఁడు కద వైజయంతంబు, తన కేమొ యిది శాశ్వతం బటంచుఁ
గావించెఁ గద యోలగము సుధర్మాస్థాని, తన యధికారంబె తప్ప దనుచుఁ
బాలించెఁ గద స్వర్గపట్టనం బేపట్టు, నను దన కదియె కాణాచి యనుచుఁ
గొలిపించుకొనెఁ గదా పలపించి యప్సరస్సతులచేఁ దన కెంపె సతమటంచు
నార యాయింద్రుఁ డిప్పుడెందరిగనొకొ, మునలఁదొలివేల్పుల మాటమఱియు [సవతి
తల్లికొమరుల మాటఁ దత్స్వర్గరాజ్య, మెల్లమనకనుభోజ్యమం చెఱుఁగఁడొకొ.

గీ. అనుచు నమరేశ్వరసమృద్ధిహరణరూప, కాభిమతసిద్ధిజనితధన్యత్వబుద్ధి
శుద్ధమాత్సర్యగుణసమాబద్ధమగుచు, నుద్ధతత్వంబుఁ బ్రకటించుచుండు నంత.

సీ. మునుమున్నె లేవయ్యె నెనసియుండినహవిర్భాగముల్ సురలతోఁ బడయఁజనఁకు
సమకూరలేవయ్యె నమృత మింద్రునితోనె, యంతస్స్వర్గితం బోట నపుడు భుక్తి
యందుండి యెట కేగి యరుగంగఁ బ్రతిబంధకం బయ్యె నాత్మీయకర్మపాశ
మొక్కైన నచ్చోట నే యుండవలె నన్న, దుస్సహం బయ్యె దైత్యులిడు బాధ
యయ్యయో యిట్టిదశ గల్గె నభ్యయోగ్య, మైన యధికారమునఁ దప్పె దయ్యె "స్వర్గ
మునకుఁ బోయిన నొడియేకు" లనువితాన, ననుచు వగఁ జెందెఁ గర్మదేవాళియ [పుడు

ఉ. ఆమెయి నాకలోకవిభవాక్రమణం బొనరించి దానవ
గ్రామణి దానవప్రథమగణ్యయశం బనిశంబునుం ద్రిలో
కీమహనీయమై వెలయఁ గేవల ధీవిలసత్ప్రభావుఁడై
స్వామిహితైకతంత్రులగు వాకల మంత్రులు గాఁగఁ గైకొనెన్. ౧౧౪.

చ. స్వజనములోఁ బరస్పరము స్వప్నమునందున మత్సరత్వముం
బ్రజల కొకళ్లొకళ్లకును భావములం గలహప్రవృత్తియుం
బ్రజనితమైనచో విభుఁడె బన్నము నొందు టెఱుంగఁ గాన న
గ్గజిబిజి లేక యుండ నధికార మొనర్చె సమర్థితార్యుఁడై. ౧౧౫.

ఉ. ఎవ్వరి నెట్లు మన్పఁదగు నెవ్వరి నేక్రియ గారవింపనౌ
నెవ్వరి నేవితానఁ దనియింపఁగ వచ్చును వారి నెల్లఁ దా

నవ్విధి నాదరం బెసఁగ నారసి ప్రోచిన సుస్థిరంబుగా
నివ్వటిలున్ విభుత్వమును నీతిఁ జరించు నతం డతంద్రుఁడై. ౧౧౬.

గీ. అతఁడు బలియును బుణ్యజనాగ్రగణ్యుఁ, డమితకర్బురసము పేరుఁ దగుటఁ జేసి
యరసి యాత్రియులకు నెల్ల నభిమతార్థసిద్ధి గావించుచును బ్రోదిఁ జేయుచుండె.

క. ఇచ్చోట వియచ్చరపతి, లచ్చుమగని ప్రేమ గని తలంపునఁ గల యా
గ్రచ్చర లాదవించుకొనం, దచ్చరణశరణ్యవృత్తిఁ దగ వర్తిలుచున్. ౧౧౭.

సీ. ఉరుతరమణికిరీటోత్తమాంగము వాఁడు, ఘనసన్నిభోత్తమాంగముల వాఁడు
బాహాంతరాళసంభరితతల్పము వాఁడు, వటదళాహ్యాఢ్యితల్పముల వాఁడు
కమనీయఘనకనత్కనకనేత్రము వాఁడు, ధవళాబ్జపత్రనేత్రముల వాఁడు
పరిపాలితానేకభక్తచక్రము వాఁడు, కరధృతశంఖచక్రముల వాఁడు
అంబుజప్రియకోటిధామంబువాఁడు, మునిహృదయవికుంఠధామముల వాఁడు
విధికినిగమంబులొసఁగిన విధిగ నాడు, సిరులనాకిడి యెపుడు రక్షించు నాకు.

ఉ. ఎవ్వఁడు విశ్వమెల్ల సృజియించె విరించనరూపధారియై
యెవ్వఁడు ప్రోచుచుండుఁ గమలేక్షణుఁడై యుపసంహరించువాఁ
డెవ్వఁడు రుద్రరూపమున నీభువనస్థితి నస్తదాదులం
డెవ్వఁడు నివ్వటించె నతఁ డెప్పుడు నన్గృపఁ బ్రోచుఁ గావుతన్. ౧౨౦.

మ. తన కేకృత్యములం బొరంతయును స్వాతంత్ర్యంబు లే దీశ్వరుం
డును సర్వజ్ఞుఁడు సర్వసాక్షి భగవంతుం డైనయాశౌరి దే
యని యెవ్వండు ప్రపన్నుఁ డౌ నతని స్వీయత్వాభిమానంబు చేఁ
గని రక్షించుచునుండు నే డేల ననుఁ జూలం బూను నివ్వట్టునన్. ౧౨౧.

కం. అపాయనిరియై సిరి యెప్పనిపాయని కరుణఁదోడు పడ లోకములన్
గని కరముఁ బ్రోచు నాతని, కనికర మింత నెపుడు పడయఁగలుగు నాకున్.

మ. అని యీరీతి నమర్త్యనాథుఁడు ప్రపంచాతీతసామర్థ్యవ
ర్తనుఁ డౌ శ్రీహరిదివ్యమంగళపవిత్రశ్రీచరిత్రంబు లె
ల్లను గీర్తించుచు నార్తి మీఱఁగ నురంగ్లక్ష్మీప్రసాదార్థియై
యనిశంబున్ మద నాదిపంపక్షుల నేప్రార్థించు చున్నంతలోన్ ౧౨౩.

క. అరుదెంచి గురుం డపు డా, హరిహయుఁ డప్పగిది దీనుఁ డై యుండినయా
యరుదెంచి భగవదిచ్ఛా, పరిణతికిం దిరుగు లేమి భావించి యనున్. ౧౨౪

చ. పురుషుఁడు దానె కర్త నని పొంగుట యెంతయు బుద్ధిలోప మీ
శ్వరుఁ డఖిలప్రపంచపరిపాలకుఁడై నిఖిలాంతరంగముం
దిరుఁ డయి కర్మవృత్తులు జనింపఁగఁ జేసి స్వతంత్రశక్తిచే
సరవిగఁ దత్ఫలంబుల నొసంగుచు నెక్కుఁ డెసంగు లీల చేన్. ౧౨౫.

ఉ. వచ్చును మేలొకప్పు డటు వచ్చును గీడు నొకప్పు డంచు మే
లిచ్చఁ దలంపకుండునరుఁ డెవ్వఁడు గీడుఁ దలంప వాఁడెపం
డెచ్చును దగ్గ లేక ఫలియించుశుభాశుభకర్మసంచయం
బచ్చుపడంగఁ గర్తతతి యప్పరమేశ్వరులీలచే నగున్. ౧౨౬.

సీ. గ్రావసంఘంబులాఘవ మొందుఁ దూలము, గౌరవ మొందున కర్కజము గాఁగ
స్థలవిభాగములు కచ్ఛములౌననూపముల్, మరుభూములగును విస్మయముగాఁగ
నాఢ్యుఁ డకించనుం డగునిర్ధనుఁడు మహా, ఢ్యత్వంబు నొందును బ్రంబుగాఁగ
స్థానీయతతి యరణ్యానీత్వము వహించు, విపినముల్ పురములౌ వింతగాఁగ

తే.గీ. జిత్రచిత్రప్రభావైకపాత్రుఁడైన, యీశ్వరుని శక్తిచేత నీయింద్రజాల
మును గనుచునుండి పురుషుఁడు తనకెంత, శక్తిగలదని భ్రమయునైశ్వర్యమునను.

కం. పెట్టెమును పెద్దియపు డది, పుట్టుట తొల్లిగానఁ బురుషుం డెదలోఁ
బెట్టుకయుండిన యర్థము, పుట్టమికై వగల మిగులఁ బొగులఁగ నేలా. ౧౨౭.

చ. ఒకఁ డపకారముం జలిపె నొరువఁ డొలక కిన్కనంచు వే
ఱొకఁ డుపకారముం జలిపె నొప్పగు ప్రేమ దలర్ప నంచు నా
రక పరులందుఁ బెట్టు నది ప్రాజ్ఞతయే తనచేసికొన్న చేఁ
తకు ఫల మప్పు డప్పు డగుఁ దప్ప కటంచు నెఱుంగ కక్కటా. ౧౨౮.

క, ఎపు డెపు డెద్ది యొనర్చిన, నపు డపుడు ఫలించు నదియె యని యెంచినచో
నుపశాంతి నొంది మానస, మపరిమితానందమగ్నమై తనివిఁ గనున్. ౧౩౦.

క. కావున నో శ్రీవల్లభ, కావు నను౦ గృప నటంచుఁ గని వేఁడినచో
నావంత మనములో నిఁక, నావంత మనము వహింప మవ్విభు కరుణన్. ౧౩౧.

క. అరిదరకరుఁ డగుహరి యిపు, డరిదరకరుఁ డగుచు నీకు నభయం బిడునో
సురవరదానవరిపుభా, సురవరకారుణ్యగరిమఁ జొప్పెఱుఁగ వాకో. ౧౩౨.

గీ. అపుడు పరిసరవర్తులై నట్టిసురలు, దివిజవిభుఁ గాంచి యొజ్జలుఁ దెలిపి నటుల
భక్తవత్సలుఁ డగుపరవాసుదేవు, దర్శన మొనర్పఁ కిందేల తడవు సేయ. ౧౩౩.

చ. అనవుడు దేవభర్త చతురాస్యసమైన నలభ్యమైన యా
ఘనునిపదాంబుజంబులను గన్గొను సంతతిభాగధేయమా
సనకసనందనాదు లగుసంయమివర్యులలో నొకఁడనో
యనవరతాత్మబోధభరితాత్ముఁడనో యెటు నాకుఁ జొప్పడున్. ౧౩౪.

శా. ఆవైకుంఠ పురాధిరాజ్యవిభవం బామూలచూడంబుగా
నే వేమాఱులు సన్మునీశ్వరులు వర్ణింపంగ భక్తిస్ఫుర
ద్ధీ వింటిం గనుఁగొంటి నెక్కటతటి వాగ్దేవాదు లేగంగ నే
నీవాచస్పతి మున్నుగాఁ జని దిశాధీశానుషక్తుండనై. ౧౩౫.

క. అప్పటి నాచొప్పెప్పుడుఁ, జెప్పఁగ లేదయ్యెఁ గాని చెప్పఁగ వలసెం
దప్పక యిప్పుడు మీతో, నప్పురి మాయూరుఁ బేరు నడిగెనె యొకఁడున్.

సీ. కడుపునఁ గన్నట్టి కొడుకైన బ్రహ్మకు, వెలుపలి పూఁదోట విడియఁ గలిగెఁ
బులహపులస్త్యాది మునిసంఘము వసించె, గరుడముఖ్యులగృహాంగణములందుఁ
గథలఁ గాలక్షేపకరుఁ డౌట మనయొజ్జ, లక్కడక్కడ నిత్యయాత్ర జరిపె
నేను విష్వక్సేను నింటిపంచటరుంగు, నందు నిల్చితిఁ బదియాజ్ఞ వడసి

తే.గీ. విప్పి దివ్యాలయములచొప్పఁ జెప్పనేల, విరజదరులందు నిరవొందు తరుల జాడ
నిలువనీడయ్యె వారకన్యల గునట్టి, యమరులకు నందు నామరూపములు గలవె.

సీ. ఉపనిషద్విద్యార్థ ముపదేశ మొనరించు, రాజకీరము గిశోరములఁ జూచ్చి
సామగానక్రియాసామర్థ్యమును దెల్పు, బుంస్కోకిలము శాబములను జేర్చి
హరినామకీర్తనం బభ్యసింపఁగఁ జేయు, శారికదారికాసమితిఁ గడిసి
ప్రణవనాదబ్రహ్మపరతత్త్వ మెఱిఁగించుఁ, బుష్పంధయము డింభములను డాసి

తే.గీ. యచట నుద్యానతరువుల నధివసించి, సంతతానందతుందిలస్వాంతవృత్తి
నిర్విచారప్రచారంబు నివ్వటిల్ల, శౌరికరుణాకటాక్షప్రసారమహిమ. ౧౩౮.

చ. గరుడుఁడు శేషునిం దరియఁగాఁ దనకోఁటల దువ్వఁ జట్టుప
ల్గరుదనిలాంకురాన్నకబళంబులఁ దృప్తిగ వేయునోళ్ల వా
విరిఁ దగుపేర్మిఁ డాసితినిపించు నతండును నిచ్చలుం బర
స్పరకలహంబు కల్మిఁగల పట్టునఁ బుట్టునె యెట్టివేళలన్. ౧౨౯.

మ. ఘననీలాభఘనంబులున్ భుజచతుష్కంబుల్ పయోజాతలో
చనముల్ గౌస్తుభభూషణంబులును భాస్వచ్ఛంఖచక్రంబులున్
వనమాలల్ గనకాంబరంబులును శ్రీవత్సంబులుం గల్గి వా
రును వీరంచును వేరులేదు హరిసారూప్యంబు లందందఱున్. ౧౩౦.

కం. కలశీహృతవిరజామల, జలశీకరసేకరచితసంస్థలతాంచ
ద్దలశీతలతులసీవన, తలసీమ మెలంగు ముక్తతతులం దెపుడున్. ౧౩౧.

సీ. కోమలతులసీసరామోచనశ్రీమ, హామవిచారణవృత్తి నెసఁగు వారు
ధవళమృదూర్ధ్వపుండ్రవిశేషకవిశేష, ధారణగోష్ఠిచేఁ దనరు వారుఁ
గల్యాణగుణగణాఖండతరానుసంధానచింతనచేఁ దనర్చువారు
నిత్యసూరిసమాజనిర్ణీతహరితత్త్వ, సిద్ధాంతఫణితిఁ జర్చించు వారు

తే.గీ. నగుచు నెందెందుఁ బరికింప నందు నందు, నెగడు నిత్యవిభూతిఁ జెందినయనేక
దాససంఘము పుష్కరము పదంబునందు, సందడిగఁ గ్రందుకొని మహానందసీమ.

గీ. అందు గోవిందదివ్యపాదారవింద, యుగళసందర్శనస్పృహానిగళబద్ధ
దశ వసించితి నమితవత్సరము లేను, లేమి లేమున్న వసనెడ లేమనటు చు.

గీ. అది యఖండతరప్రకాశాభిరామ, మగుట నిది పగ లిది రేయటంచుఁ దెలుప
రాని నచ్చోటఁ గాలనిర్ణయము సేయఁ, దరము గాదయ్యె మనబుధాగ్రణులకైన.

కం. అటులుండఁగ నామనమున, ఘుటియిల్లె నొకింత విసువు పటుకట యిట్లీ
చ్చట నిల్చు టెన్నినాళ్లో, యటమటగా నున్న దనుచు నవివేకమునన్. ౧౩౨.

కం. పురిఁ బౌరసమాజంబుల, దరిఁ గాలక్షేపమునకుఁ బరియం జన నె
వ్వరునైన నించుకైనను, బరికింప రటన్నఁ బలుకఁ భావింతు రటుల్. ౧౩౩.

గీ ఒక్కతఱి నొక్కరుండఁ బురోపశల్య, వనులవసపాలునైన నావంకఁ జూచి
పలుకరించిన నుబుసుపోవచ్చు ననుచు, సంచరింపుచు నిటు మది నెంచుకొంటి.

సీ. నిత్యకృత్యంబుగా భృత్యభృత్యులనైన, కార్యకారులటంచుఁ గాంచుకష్ట
మేపూఁట కాపూఁట కెక్కుడుగుమ్మంబు, దిగెడుగుమ్మంబుగాఁ దిరుగుశ్రమము
నెవరైన స్వామికి నెఱిఁగింపరాకోయంచుఁ, బ్రతిహారుల భజింపఁబడుప్రయాస
మేద్వారివాహ్యాళి కేతెంచు భగవంతుఁ, డని యిటునటుఁ ద్రోవ లరయుకస్తి

తే.గీ. కటకటాయిట్టిదనుచుఁ దప్పుటకుఁదరమె, విసువుపుట్టించునాశ్రయ వృత్తియెట్టి
వారికైనను బ్రాపింపవలదు కార్య, పరుల కెచ్చోట నిట్టివే బాము లనుచు.

సీ. ఎవరైన వడివడి నెదురుగా నేతేర, నను బిల్చుటకె వత్తు రని తలంతు
సఫలప్రయత్నులై చనువారివార్తలు, విని నాకు నిటు లెప్పు డని తలంతు
నగరిమోసలకీవి నడయాడువారినెల్లను స్వామివల్లభు లని తలంతు
దేవేరిబోనగత్తెలచేత నైన నా, మనవిఁ దెల్పింతునా యని తలంతు

తే.గీ. నాకలోకంబునుండి నారాకఁ జెవుల, సోఁక నెఱిఁగించు వారలు లేకయిటుల
శ్రీకళత్రుఁ డుపేక్షించెఁ గాక యున్న, నీకరణి నుంచునే యంచు నేకతమున.

శా. ముల్లోకంబుల నేలుచుండు సవనంబు ల్వేలు గావించితిన్
దల్లింబై తనుసౌమనస్యమున వర్తింతున్ బుధశ్రేణియం
దెల్ల న్ముఖ్యుఁడనై మెలంగుదను నన్నే యి ట్లుపేక్షించినాఁ
డుల్లంబందు నెఱుంగఁడో హరి యటం చూహించు చున్నంతలోన్ ౧౫౦.

మ. ఒక మందారమహీజకోటరకులాయోపాంతమందున్న శా
రిక వేఱొక్క నికుంజనీడగతశారిం జూచి వీఁ డెవ్వఁడో
వికలస్వాంతుఁడొ దుర్వినీతుఁడొ గ్రహావిష్టుండొ నా నూరు చే
రక వర్తించుచు నుండెడిన్ హరిసపర్యాగంధహీనుండనన్. ౧౫౧.

ఉ. నావిని వీఁడు మూఁడుభువనంబుల నేలెను వాఁడ నంచునుం
దా విధి మీఱ నూఱుసవనంబు లొనర్చినవాఁడ నంచునుం
గేవలసౌమనస్యమునఁ గీర్తిఁ బ్రవర్తిలుచుండు నంచు నా
నావిబుధప్రధానతఁ దనర్చెద నంచు మెలంగు గర్వియై. ౧౫౨.

సీ. ఒకటి రెండు జగంబు లొక్కఁడె వీఁడేలు, వాఁడ నంచును గర్వపడుచునుండు
నిట్టివి పదునాల్గు సృజియించినవిరించి, యేమూల నుండెనో యెఱుఁగ మెవర
మట్టిబ్రహ్మాండంబు లమితసంఖ్యలు సృజింప, నను బెంప నణఁగింపఁ గనుసమర్థుఁ
డైనశ్రీరమణుపాదాబ్జముల్ దలఁకించు, సప్రహాయను నిగళంబు చేతఁ గట్టు

తే.గీ. పశియైనఁటదానుముక్తులే♦పడయఁదగిన, ఫలము బద్ధున కేరీతిఁ ♦ గలుగునో కో-
యని తలంపక తన కబ్బు♦నని తలంచు, నెంత మూర్ఖుండో వీఁడంచు ♦ నేవగించి.

కం. హరిపదసందర్శన మఁట, దురహంకారాతిరేక♦దుర్లలితహృదం
తరుఁడగు దన కఁట యెసనది, దొరకమి కొక్కింతవిసుగు♦దోఁచెనఁటకటా. ౧౫౪.

సీ. బహుజన్మవాసనా♦పరిపాకసంలబ్ధ, నిశ్చలాత్మజ్ఞాన♦నియతిఁ జెంది
భగవదర్పణముగా♦భావించి సత్కర్మ,ముల నొనర్చుచు విని♦ర్మలమనీష
సకలభూతములందు ♦ సమత వర్తించుచు, శాంతుఁడై దాంతుఁడై♦ సంతసమున
సర్వజ్ఞభావంబు♦సార్వత్రికత్వంబు, సర్వేశ్వరత్వ మీ♦శ్వరుని దనుచుఁ

తే.గీ. దెలిసి సంతతసత్సంగ♦విలసనమున, సొరిది నిస్సంగుఁడై ద్వంద♦శూన్యవృత్తిఁ
బరమభాగవతుండైన♦వాఁడు కాని, శ్రీహరిపదంబునందఁబోఁ♦జెందఁగలఁడె. ౧౫౫.

శా. తా సేవ్యుం డఁట సేవకత్వమున ని♦త్యంబు న్నిజస్తోత్రవి
న్యాసం బొప్ప బుధవ్రజంబు దన గే♦హద్వారపార్శ్వంబునం
దీసంక్రందను దర్శనం బెపుడు చే♦యించుం బ్రతీహారియం
చాసం జేసి వసింపఁ గోరు నఁట వీఁ♦డత్యంతగర్వాంధుఁడై. ౧౫౬.

కం. అని యాడు కొనెడుమాటలు, విను నప్పుడు నేను మిగుల♦విస్మయలజ్జా
వనతాస్యుఁడనై వానికి, వినతాంగుఁడ నగుచు విన్న♦వించితి నిట్టుల్. ౧౫౭.

ఉ. శారికలార! శారికడ♦సారెకుఁ జారుకథార్థముల్ మనో
హారికలారవస్ఫురణ ♦ నద్భుతభంగి నెసంగు నట్లు గాఁ
గోరికలారఁ దెల్పుచును ♦ గూరిమి గాంచెదు మీర లీజగ
ద్భారికలారహస్యముల ♦ పోఁడిమి బుద్ధి నెఱుంగు టబ్రమే. ౧౫౮.

కం. ఏ నెప్పుడు హరిపదని,ధ్యానము గావింతు నొకో♦యని మదిలో నెం
దే నెప్పుడును దదేక,ధ్యానమున నె యుంట మీహృ♦దయ మెఱుఁగ దొకో.

గీ. శౌరిపదదర్శనవ్యాప్తిఁ ♦ గోరి వచ్చి, యింతకాలంబు నిందుంటి ♦ మిందఱమును
మాయుదంతంబు నొక్కింత♦మాత్రమైన, స్వామికెఱిఁగించువారలె♦వ్వారు లేరు.

గీ. మాకు నయ్యైపదముల క♦మ్మాధవుండె, ప్రోవుఁడనుచు నధికార♦ముల నొసంగె
భక్తి నే మమ్మహాత్ముని♦యుక్తిఁ జేసి, పాయకొనియుంటి మయ్యయి♦పదములందు.

క. ఈవడువున నే మెల్లను, శ్రీవల్లభుదివ్యపదము సేవింప మదిన్
భావించి వచ్చి యిచ్చట, సేవిడియుట నచటి చందమే మయ్యె నోకో. ౧౬౨.

చ. అన విని వానిలో నొక విహంగము నన్నని యెంతమాట నీ
మనమునయందు నెప్పుడు రమారమణాంఘ్రిసరోజయుగ్మద
ర్శనకుతుకంబె కాని యితరస్పృహ లేమియు లేమికి న్నిద
ర్శన మిదె చాలు నింటికడ చందము లందలి చింత యొప్పదే. ౧౬౩.

చ. పదపద నీకుఁ జూడ భగవత్పదదర్శన మేడ బ్రహ్మ ల
ర్బుదములు పంచలం దిరిగి పోవుదు “ రేనుఁగు లేటఁ గుంకుచో
వదలక పాటిరే వడుగ వచ్చెను నక్క ” యటన్న భంగి ను
న్నది కద నీదు చందము వినందగ వింకిట మాకు నీనుడుల్. ౧౬౪.

చ. అనుచుఁ దృణీకరించి తెగనాడిన రెండవయండజంబు న
న్నని వచియించె నీకిపుడు గల్గదు నీయభిలాషసిద్ధి యె
వ్వనికి లభించె మున్ను భగవత్పదదర్శన భాగ్య మెంతయున్
ఘన మగుప్రాజ్యరాజ్యమదగర్వము సర్వము వీడు నంతకున్. ౧౬౫.

గీ స్వామి సన్నిధిఁ దెలుప నెవ్వారు లేర. టంచుఁ బల్కెతి వింతయా నార శౌరి
యనఁగ సర్వజ్ఞుఁ డతఁ డెఱుంగ నివి గలవె, యింత యజ్ఞాని వేమిర యింద్ర నీవు.

గీ. అతఁడు ప్రాకృతనేతల గతిని మనవి, దెలుపఁ దగువాఁడె భక్తులు దలఁపఁ దోఁచు
నప్పు డిప్పుడు నందిందు నతనికితని, కనక యెవ్వఁడు నందంద నందతికిని. ౧౬౭.

ఉ. మంతనమంచుఁ గొన్ని మటుమాయలమాటలఁ జెప్పి పుచ్చుట
య్యంతిపురంపుటూడిగపుటన్నులమిన్నల నాశ్రయించుట
త్యంతముఁ గార్యసాధనము లోఁ గలికాలపుఁబ్రాకృతావనీ
కాంతులపట్ల నట్లనె జగత్పతియా వారిపట్ల నెంచితో. ౧౬౮.

చం. ఉపచితిపాత్రుఁ డార్యుఁడు సమున్నతకీర్తి యుదాత్తమూర్తి వా
జ్ఞ్నపుణుఁడు ప్రత్యయాస్పదుఁడు నిర్మలచర్యుఁడు ధైర్యధుర్యుఁ డా
త్మపరబలాబలజ్ఞుఁ డసమప్రతిభాంకుఁడు నైన నీగురుం
డెపుడుఁ ద్వదీయకార్యఘటనైకరతిం దగు నీతిచాతురిన్. ౧౬౯.

కం. నిరతంబుఁ దదనుమతికృతి, నిరతం బగుచిత్తవృత్తి నిరహంకృతివై
కరణీయంబుల భృత్యుని, కరణిం గావింతు వేని కరుణించు నినున్. ౧౭౦.

కం. అని బుద్ధిఁ గఱపి పొమ్మన, మనపురికిం గురుదిగీశమండలితోడం
జనుదెంచి యచటి వార్తలు, వినవిన స్మయ ముడిగె మదిని విస్మయ మొదవెన్.

ఉ. పౌరుల నెల్ల రాఁ బిలిచి వచ్చితి మిచ్చటి కిన్నినాళ్లకే
మీరలు నందఱున్ సుఖులె యెవ్వఁడు నెవ్వగ మానియోగముల్
సారెకు నప్రమాదగతి సల్పుచు నుందురె క్రూరదైత్యు లె
వ్వారును దాడి రారు గద వచ్చిన వారల నోర్తురే కదా ? ౧౭౧

సీ. వైజయంతము పొంత వర్తింతు రెవ్వార, లెవరు సుధర్మ చెంతవసియింతు
రమృత కుండోపాంతమం దుందు రెవ్వరు, కామధేనువుదొడ్డిఁ గాతు రెవరు
గురుమందిరమున నెవ్వరు కావలిగ నుందు, చింతామణిని బరీక్షింతు రెవ్వ
రైరావతముఁ బ్రోది నరయు వారెవ్వార, లుచ్చైశ్శ్రవముఁ ద్రిప్పుచుందు రెవరు

తే గీ. నందనవనమ్ముఁ బరికించుచుందు రెవ్వ, రెవరు మందాకినీతీరసవిధవివిధ
మణిఖచిత వేది సోపానమండపములు, శిథిలములు గాకయుండ వీక్షింతు రిపుడు.

సీ. ఇచ్చోటి కెపుడైన విచ్చేయుచుండునే స్వైరసంచారుఁడౌ నారదుండు
మునితపోవిఘ్నార్థముగ నిల్పఁబడిన యప్సరలు వర్తింతురే సఫలగతులఁ
బుణ్యకర్మఫలానుభూతి కై రావ్యోమ, యానముల్ సుకృతుల కనువఁబడునె
దైత్యనాథులరాజధానులఁ ద్రిమ్మరు, ప్రణిధులు వత్తురే వార్తలరసి

తే.గీ. యాశ్వినేయుల భైషజ్య మమరుచున్నె, ప్రపక్వలావర్తకకులాభ్రములు ధరిత్రి
సమయసముచిత భంగివర్షములఁ గురియు, చున్నవియె జన్నములఁ బిల్పులాదవుచున్నె

మ. అను నాపల్కుల నాలకించునవుడన్యోన్యంబు వక్త్రంబులం
గనుఁగొంచున్ భయవిస్మయంబులు పెనంగ న్వారు వేరొక్కచో
వ్వునఁ జూపట్టఁగఁ జెప్ప నేమిటికి మిమ్ముం జూడ నాడెందమం
దున నొండొక్క వితానఁ దోఁచు నన నన్నుం జూచి వారందఱున్. ౧౭౫.

క. దేవా దేవరహృదయం, బీవిఁకనుభ్రాంతిఁ జెందదు నీరలు మాతో
నావైకుంఠమునకుఁ జనఁ, గావలె నని పలికి చాలఁ గాలం బయ్యెన్. ౧౭౬.

క. వేవేలయేండ్ల క్రిందట, నీవడుగ్గున ననుట మాత్రమే గాని యదే
మో వైకుంఠపురంబున, కై విచ్చేయుటయు లేదుకద యిప్పటికిన్. ౧౩౭.

సీ. మొన్న గదా మీరు పూజించి ముచ్చటించితిరి నారదమునిశ్రేష్ఠు తోడ
నిన్న గదా మీకు విన్నవించిరి దైత్య, పురులవార్తలు గూఢచరులు వచ్చి
నేఁడేగదా మిమ్ముఁ జూడఁగా వచ్చిర, చ్చర లుర్వి మునులనిష్ఠలను మాన్పి
యిప్పుడే గద మీర లేతెంచుపుణ్యులఁ, కంపించితిరి వ్యోమయానములను

తే. గీ. మఱియు నెల్లిగదయ్య యేమఱక మేము, మీరు గావింపుఁడని నియమించినట్టి
కర్జములనెల్ల జాగరూకతఁ గడంగి, కొలువువేళకు సవరించుకొనఁగ వలయు.

కం. ఈలో మహి కెన్నిపరుల్, హాళి న్నృపకన్యకాస్వయంవరకల్యా
ణాలోకనార్థ మీరెం, తేలలికచి వెంట నరిగితిరి సురయుతులై. ౧౩౯.

మ. అనుచుండం బయినుండి తోఁచు నొకఘంటారావమాలించి వా
రును నేనుం దలలెత్తి మీఁదుఁ గనుచోఁ గ్రొమ్మించులన్నించుచున్
స్తనితోదంచిత మైనమేఘ మనఁగా సైన్యంబుచే రాణ గాం
చిన చొక్కంబగు వ్యోమయాన మరుదెంచెన్ శంఖచక్రాంకమై. ౧౪౦.

కం. క్రమశమితవేగమై యా, పమానమసమానమైన విభవస్ఫురణం
బమరంగ నల్లనల్లన, మము డగ్గఱి నిలిచెఁ జూచుమాత్రములోనన్. ౧౪౧.

కం. అందుండి యిందిరాకృతు, లం దగుకొందఱు వెలందులం గూడి శచీ
సుందరి వెలువడిరా మా, యందఱిడెందముల యందు నబ్బుర మొదవన్.

ఉ. ఎక్కడి కెప్పు డేగితి విదేటి విచిత్రము ప్రాణనాయికా
యిక్కడ నిన్ను నిప్పుడు గదే కనుఁగొంటి నటంచుఁ బల్కఁగా
నక్కజ మంది యేమి యిటులానతి యిచ్చెద రిప్పుడే కదా
యిక్కమలావధూసఖులు నేనును డిగ్గితి మీవిమానమున్. ౧౪౩.

సీ. నాఁడు వైకుంఠంబునకు మీర లటు లేగు, నపుడె తోడ సెవత్తు ననఁగ నుడుగు
మని యింట నను నిల్పి యరిగిన మఱునాఁడె, శ్రీలియుంగర మాన వాలొసంగి
శ్రీదేవి నినుఁ జూడఁగాఁ దోడి తెమ్మనె, నని యీవిమానంబు ననుపలేదె
పనిచిన నన్నందు వసియింపఁ జేసి యీ, ప ద్మావధూసఖుల్ పరమపదము

తే. గీ. నందు నామె వసించుశు♦ద్ధాంతమందు, డింప నామెయుఁ బ్రేమ వా♦టిల్లఁబిలిచి
యుండు మిచ్చోట నీభర్త♦యుండునంత, కాల మని యానతిచ్చిన♦న్గారవించె.

గీ. ఎన్నినాళ్లందు జరిగెనో♦యెఱుఁగఁగాని, నాఁటిబోటుల నల విమా♦నమునుగూర్చి
యిపుడిపుడె యాయితంబుసే♦యించిపలికె, నన్ను సానుగ్రహాలోక♦నములఁజూచి.

కం. అమ్మా నీపతి నిజనగ, రమ్మునకుం జనియె నిపుడు ♦ గ్రక్కున నీవుం
బొమ్మా మేలగుఁ జక్కఁగ, బొమ్మా యని భద్రవస్తు♦వుల నిడి పనుపన్. ౧౮౬.

కం. వచ్చితిమీ యనుపదమున, నిచ్చటికై యిప్పు డిపుడె♦ యింతకు మునుమీ
రిచ్చటఁ గాంచితి మనుమీ, ముచ్చట కెంతయును స్వాంత♦మున వింతయగున్.

గీ. అనుచుఁ దనవ్రేలి నుండి ము♦న్నానవాలు, పనిచి నట్టిది యిదియె గై♦కొనుఁడటంచు
నుంగరమొడల్చినాచేతి♦కొసఁగు నపుడు, నాకరాంగుళిఁజూడశూ♦న్యముగఁదోఁచె.

కం. దొంతరవింతలచే నిటు, దంతుర మగుభ్రాంతి దోఁగి ♦ తల్లడపడునా
స్వాంతంబు చెదర నచ్చటి, కంతట నారదమునీంద్రుఁ♦డరుదెంచె వడిన్. ౧౮౯.

ఉ. వచ్చిన మానిఁగాంచి తగు♦వైఖరి మన్నన చేసి యేమి రా
యిచ్చటి కిప్పు డీయతివి♦శృంఖలుఁ డైనమహానుభావునిం
దెచ్చితి వీశ్వరా యని మ♦దిం దిగులొందుచునున్న నాతలం
పిచ్చ నెఱింగి యాతపసి♦యిట్లనె నల్లన సస్మితాస్యుఁడై. ౧౯౦.

శా. ఓహో యేమిది విన్నఁబా టొదవ నే♦దో వింతయో చింతయో
మోహంబో మదిఁ దోఁగినట్టుల యథా♦పూర్వాననశ్రీసము
త్సాహాకారవిచేష్టితస్థితులచే ♦ స్పష్టంబుగా నాత్మలం
దూహింపం దగి యుండె దీసురశచీ♦యుత్తుండవై వాసవా. ౧౯౧.

గీ. అనిన నప్పటివాస్థితి♦యంతవట్టుఁ, దెలుప నాలించి పలికె న♦ద్దివ్యబోధ
మహితుఁ డిదియెల్ల నల్పసా♦మ్రాజ్యమత్తమతి వయిన నీదుదుర్మో♦హగతినె కల్గె.

గీ. ఇంత దుర్మోహమతివిగా♦వేని నన్ను, నతివిశృంఖలుఁడైనమ♦హానుభావుఁ
డని తలంతువె దేవర్షి♦నగుట నాకుఁ, ద్వద్విచారంబు నుడుప రా♦వలసె నిపుడు.

మ. నిగమాంతంబులు నిట్టివాఁడనుచు వ♦ర్ణింపంగ లేవన్నచో
జగదీశుం గనుఁగోఁ దరంబగునె దు♦స్సంసారమోహాంధునై

తగువిభ్రాంతహృదంతరంగులకు యత్నంబెంతఁ గావించినన్
భగవద్భక్తుల కట్లుగా కతఁడు చూపట్టుం గదా యంతటన్. ౧౯౪.

మ. తనభక్తుండను నేను గానొ నను వాత్సల్యాతిరేకంబునం
గని స్వీయంబగుదివ్యవిగ్రహముసాక్షాత్కారముంజేసి ధ
న్యునిఁ గావింపఁగ రాదొ యంచనెదవేమో నీవు భక్తుండవై
న నతం డిట్టు లుపేక్ష సేయునె సురేంద్రా యేల యీదుర్భ్రమల్. ౧౯౫.

కం. విను భక్తుల తెఱఁగెఱిఁగిం,తును గోప్యము దృశ్యమగుచుఁ దోఁచిన యది యె
ల్లను వారలు శ్రీహరి భా,వనఁజూతు రతఁడు జగన్నివాసుం డగుటన్. ౧౯౬.

కం. హరి సర్వత్ర కలం డను,బరమార్థము నెవ్వఁ డెఱుఁగు భక్తుఁడు వాఁడే
హరియు న్వానికె యెల్లెడఁ, గరుణించుం దనదుమూర్తిఁ గనుభాగ్యంబున్.

గీ. తరలి వైకుంఠపురికి నీవరిగి యందు, నెందు గోవిందుఁ డుండునో యెపుడు నన్నుఁ
బిలువ నంపించునో యంచుఁ దలఁచుచుంటి, గాని దృఢభక్తిధ్యానింపఁ గడఁగవైతి

మ. గురుభక్తిన్ గుఱినిల్ప నేర కలవైకుంఠంబుఁ బ్రోలంచు న
వ్విరజన్వాహినియంచు నత్తులసి నుర్వీజాతమంచున్ ఖగే
శ్వరశేషాదుల నిత్యసూరులనుచున్ భావించితే కాని య
ప్పరమేశప్రతిబింబబుద్ధి మదిసంభావింపవై తక్కటా. ౧౯౯.

కం. ఎక్కడి శౌరీ జన్మం, బెక్కడి యితరాంతరంగవృత్తిజ్ఞత్వం
బక్కడిఁది యెఱుక దొరకొను, టక్కడ హరియే చరాచరాకృతినుంటన్. ౨౦౦.

కం. హరిమాయ నెఱుఁగ నెవ్వరి, తరమా పరమాత్ముఁ డెటుల దలఁచిన నటులౌఁ
బెరమాటలేల భ్రమయుట, సురమాన్యరమాఢ్యమహిమ చొప్పననె సుధీ.

కం. నీ వెపుడు సపరివారుఁడవై వైకుంఠమున కఱిఁగి తప్పాడె యిచటన్
నీవిధమున నెకమాయా, దేవేంద్రుని సపరివారుఁ దివిరి సృజించెన్. ౨౦౨.

ఉ. అంతట నూరకుండక త్వదంగన యైనశచీవధూమణిన్
స్వాంతమునందు భ్రాంతి దొలఁకాడక యుండఁగ శీలరక్షణం
బెంతయుఁ బ్రేమఁ జేయ మది నెంచి రమాసతిచేత నామె శు
ద్ధాంతమునందునుంచుటకునై పిలిపింపఁగఁ జేసె బ్రేల్మిడిన్. ౨౦౩.

గీ. అపుడు శచి కానవాలు నీ వంపి తనిన, యుంగరము శౌరిమాయా సముద్భవంబె
యిపుడు నీచేతనదితిరో హితవిధంబు, గనుటయును శౌరిమాయా ప్రకల్పితంబె.

గీ. నీవు స్వర్గంబునందు లే నితఱి నచట, నెగడు కర్జంబు లేరీతి నగునొ యంచు
నీతలను భార మెల్లనుం డెనను బుద్ధి, పుట్ట హరి నిన్ను సిలుఁగులఁ బెట్టఁ దలఁచి.

గీ. కారి కాదంభమున నిన్ను శౌరి కాని, మాటల నహంక్రియాగర్వ మదము లణఁచి
కాదు కాలాంతరంబునఁ గాని లేఁడు, హరిపదాలోకనంబు పొమ్మనుచుఁ బంచె.

కం. గెంటనికృప నంటినమతి, వెంటనె శచినింటి కనుపవే యని సిరి వా
ల్గంటి కెఱిఁగించి హరి తెఱ, గంటిదొరా పనిచె నామె గ్రక్కున నిటకుఁ.

గీ. ఈశచీవధూటి యిపుడు చూపిన యట్టి, మాయయుంగరంబు పోయె నపుడె
నీదు ప్రేలిదైన నిజమైనయుంగరం, బిప్పు డుండుఁ జూడు మీ సురేంద్ర. ౨౦౭.

కం అనువపుడు నాకరాంగుళిఁ, గనుఁగొనుచో నంగుళీయకసమేతంబై
కనుపట్ట నచటి వారల, మనంబు లద్భుతరసైకమగ్నములయ్యెఁ. ౨౦౮.

గీ. మఱియు నమ్మౌని యిట్లనె మఘవ నీకు, గురుగురూపాయచాతురీగురుతవలనఁ
గలుగు కాలాంతరంబునఁ గమలనాభు, దర్శనము క్షీరవారాశిఁ దప్పకనుచు.

గీ. ఇదియనఁగ నెంతవింత నీమది కొకింత, భ్రాంతిమాత్రంబె కలిగె నిప్పటికిముందు
నాటునస్వప్నవార్త యంతటలభించు, నిష్టసంసిద్ధి యనితెల్పి స్వేచ్ఛ నరిగె.

గీ. ఇన్నివిధముల హరిశక్తి యిట్టి దనుచు, నెఱిఁగి యెఱిఁగియు నల్పసమృద్ధిగర్వ
పరవశుఁడనౌచుఁబడరాని పాట్లఁబడితిఁ, గానియిడుమల విడనాడఁగలిగె నిపుడు.

కం. ఆ సంయమి పలుకగునను, నాన న్నానసంశయంబు లడఁగె న్నడు లే
లా సన్నము లయ్యె శ్రమము, లాసన్నము లయ్యె రమలు హరికృప నింకఁ.

చ. సురవరులార సూరిపతిశుద్ధుఁ డుదారుఁడు దక్షుఁ డైనయా
గురుఁడు గురుండు మంత్రియును సుఖుండును నియంతయునై స్వనీతిచా
తురి నను నెల్లకర్జములఁ దోడ్పడి కావఁగ నావగ ల్నిరం
తరముగ నుండు నే మది ముదంబు పదంపడి కూడకుండునే. ౨౧౪.

ఉ. ఈ మహనీయబుద్ధి బలమే కద నా కదనైనచో రిపు
స్తోమములన్ జయించు నెఱి చూపును ఱేపును మాపు నోపి స
ర్వామరసామరస్యకల నైకదశన్ ఘటియించు నేఁడు శ్రీ
స్వామికటాక్షముం బడయఁ జాలు నుపాయముఁ దెల్పుమండు నే. ౨౧౫.

క. అనవుం డాంగిరసుం డిట్లను నను నాత్మీయ నింతయగ్గించుట యొ
ప్పునె యిది యిట్లగునని సుర, ముని వలుకఁడె యతనివ ల్కమోఘము కాదే.

గీ. సాధనీయార్థమున కెందు సాధకుండు, గావలయునంచుఁ గోరుట గలదు గాని
సిద్ధమగునర్థమునకుఁ గాంక్షించు నెందుఁ గలఁడు సాధకుఁ డొకఁడు గావలయునంచు.

క. శారీవ్యపదేశశ్రీ, శౌరీరిత మైనయర్థసంపూర్ణమునే
నారదమునియుం దెలిపెఁ గదా రూఢిగ దాని కన్యథాత్వము గలదే. ౨౧౮.

ఉ. ఇప్పుడె క్షీరవారిధి నహీనశయాను ఖగేశయాను బొం
దుప్పటిఁ బూను జానుజిగి తోఁ దగు మేను మెఱుంగు రంగు బా
గొప్పగు గొప్పకప్పు మొయిలో యనఁ బొల్పగు శ్రీరమేను నే
చొప్పునఁ జేరి కొల్చుటకుఁ జొప్పను నట్లొనరింపఁ గాఁదగున్. ౨౧౯.

క. అన నందఱు నలమందర, మున నుండి పయోధితీరమును జేర గడం
గి నితాంతంబు నతాంతం, బు నుదాంతం బయినస్వాంతమున వెడలి రొగిన్.

క. మిహిరకులకలశజలనిధి, మిహికాకిరణానమత్సమీహితకరణా
వహబహు సుగుణాభరణా, ముహురగ స్తద్వంశ పురుషపూజిత చరణా. ౨౨౧

ఉ. కుంచితచిత్రకూటగిరికూటరటత్కరటత్కపాటదృ
ష్ట్యంచలపాతపాటవస్ఫుటారభటీత్రుటితారికాటవా
పంచవటీతటీఘటితపర్ణకుటీనికటాటవీనట
త్కాంచనకృష్ణసారబలగర్వవిపాటనదివ్యపాటనా. ౨౨౨.

తోటక. స్థిరగౌరవ మానసదృష్టజటా, యురభిఖ్య విహంగధృతోరుజటా
భరకృష్ణమృగాజినవల్కపటా, నిరవద్య కృపాకరనిష్కపటా. ౨౨౩.

గద్యము.

ఇది శ్రీమద్రామనామపారాయణపరాయణాతిధన్య కౌండిన్యగోత్రపవిత్ర దేవుల
పల్లికులపయఃపయోనిధికళానిధిసీతారామశాస్త్రిపౌత్ర వేంకట కృష్ణ
శాస్త్రిపుత్ర తమ్మనాభిధానాంతర వేంకటకృష్ణశాస్త్రినామాగ్ర
జన్మ త్రిలింగదేశాగ్రజన్మ సుధీవిధేయ సుబ్బరాయశాస్త్రి
నామధేయ ప్రణీతంబైన మహేంద్రవిజయం బను
ప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

శ్రీసీతారామార్పణమస్తు.

---

శ్రీరస్తు.

# శ్రీమహేంద్రవిజయము.

## చతుర్థాశ్వాసము.



హనుమత్కృతపదసం
వాహన సౌందర్యరచితవాచంయమిస
మ్మోహన రుచివిజితహరి
ద్వాహన రఘురామ సార్వభౌమలలామా. ౧.

గీ. అవధరింపుము శౌనకాద్యఖిలమౌని, మణుల కిట్లని రౌమహర్షణి వచించె
సుచిరపరిలబ్ధపుమపత్యసురుచిరకల, మంజుసంజల్పమాధురీమహితఫణితి. ౨.

మ. కని రాచార్యపురస్సరంబుగ సురల్ గ్రావారితోఁ గూడి యిం
పునఁ బెంపార శరధిం బురారిశరధిం భూదేవికిం గట్టి వి
ష్ణుని పుట్టంబును శేషశాయి కి లసద్వారాభిరూప్యంబుచే
ఘనమై చొక్కఁగఁ జొక్కమైనశయనాగారం బదూరంబునన్. ౩.

మ. కనదుత్తుంగతరంగహస్తముల సైఁగం జేసి యాత్మీయ ని
స్వనసంరంభమునన్ ముకుందుఁ డిదె యస్మన్మధ్యమం దున్నవాఁ
డని యాహ్వాన మొనర్చుచుం బృషతపాద్యం బిచ్చి తమ్మాదరిం
చునదీనుం గని కార్యసిద్ధియగు నంచుం జాల సంతుష్టులై. ౪.

కం గురు నసమయోగవిద్యా, గురుఁ గని యుపయోగమై తగుగురుచిరతరవా
గురుఫణితి నచట నపు డజ, గురుఁ గనుయోగంబును నెఱుఁగుగురుచిన్ వేఁడన్.

కం. శ్రీకారుణికు సదవనాం, గీకారుని నిత్యవిహితకిల్బిషచయబం
దీకారుని హరి నిచ్చట, సాకారునిగాఁ గనంగనగు భక్తులకున్. ౬.

మ. ప్రణమద్వశ్యుఁడు పాపకోపదురభిప్రాయాద్యదృశ్యుండు కా
రుణికస్వాంతుఁ డనంతుఁ డెప్పుఁ డెవ రేరూపంబునన్ భక్తి భూ
షణవిశేషణభాషణంబులను నిష్పన్నార్తిఁ గీర్తింతురో
యణుమాత్రంబును వేఱులేకతఁడు ప్రత్యక్షంబగున్ వారికిన్. ౯.

కం. నావుడు సురలందఱు నీవే వినుతింపఁదగుసద్వివేకివి గాకే
మేవిధి నుతిఁ జేయంగల, మావిశ్వజనీను మహిమ నన నతఁడు దాన్. ౧౦.

ఉ. ప్రాఙ్ముఖుఁడై కరంబులు శిరంబున మోడ్చి నిరంతరంబులౌ
వాఙ్మనసప్రవృత్తు లెడవట్టఁగ నిశ్చలరూఢనిష్ఠన
వ్యాఙ్మతియై యతీంద్రియచయస్థితివిస్మృతవిశ్వచేష్టచే
దృఙ్మితదేకలక్ష్యనియతిం దగ నిర్గుణతత్త్వచింతచేన్. ౧౧.

గీ. కొంతవడి నిర్వికారనిర్గుణసమాధి, నంతరంగంబు నిస్తరంగాత్మబోధ
పరిణతానందరసమయత్వమునఁ బొదలి, యంత సగుణవిషోపాధి నధిగమించి.

సీ. నవనీరదేందీవరవనీతమాలపల్లవనీలమణిలీల నవధరించి
శతభానుమండలోదితభానుమండలాంచితభానుభాసశాలితవహించి
విమలోరువిస్ఫురత్కమలోదరసమగ్ర, తమలోచనాంతవిభ్రమము గాంచి
యసమానచంద్రికాలసమానధాళధళ్యసమానవద్యమావసరహించి

తే.గీ. మించు ఘనకాయమెఱుఁగు దీపించుచాయ, చల్లనగుచూపుమందహాససంపుఁగోపు
గలిగి రాణించు దివ్యమంగళమనోజ్ఞ, మైన తేజంబు మ్రోలఁ బ్రత్యక్షమైన.

ఉ. పెన్నిధిఁ గన్నపేదవలె వేదనఁ బాసినవాసితాభ్రసం
పన్నిధియౌతదాకృతి రమాపతి దంచుఁ దలంచి సేవకా
పన్నగభేదవజ్ర మగుపన్నగశాయి వెసం బ్రసన్నుఁడై
సన్నిధి చేసినాఁ డనుచు సంతసమందుచుఁ జూచుచున్నెడన్. ౧౨.

మ. మృదులం బంబుజడంబరం బుపనిషన్మార్గ్యంబు యోగిచ్ఛటా
హృదయాగారవిహారధీరము ముహుశ్శ్రీహస్తసంవాహనా
స్పద మాకాశధునీజనిగ్రహ మజత్వప్రఖ్యసరోవోత్తమా
భ్యుదయశ్రీదము శౌరిపాద మెదుటన్ మున్ముందు చూడం దగెన్. ౧౩.

ఉ. క్షీరపయోధినుండి దరిఁ జేరగజేంద్రునిపట్టఁ దండ్రి ని
ష్కారణదోషముల్ సలిపెఁ గాన మముం బదపత్యతాదురా
కారులఁ బ్రోవవే యనుచుఁ గాళ్లఁ బెనంగెడు నక్రపోతముల్
నా రహి మించు నవ్వనజనాభునిజంఘలఁ గాంచె నంతటన్. ౧౪.

గీ. ఊర్వసి కరిష్ట మనుమాట యుండెఁ గాన, రంభ కేలయరిష్టమై క్రాలకుండు
ననఁగఁ దగుశౌరి యూరుద్వయంబునందుఁ, గొంతసేపు వసించె నగ్గురుని చూపు.

క. పొందుప్పటి కాసె బిగిం, బొందుప్పతిలంగ నెల్లపుడు సజ్జనతా
నందకమై యొప్పెడు నల, నందకమునఁ దనరు కటిఁ గనం దగె నంతన్. ౧౬.

గీ. అఖిలమునకుఁ బితామహుఁడా విరించి, యిదియ తనికొన్న మాతామహియగుఁ గానఁ
దనకొకించుక యందు బాంధవము గలదటంచు హరినాభి సగని సేవించె గురుఁడు.

సీ. ముగ్ధలీలావళీస్నిగ్ధనీలావళీ, సరళసోపానాగ్రసరణిఁ బోవఁ
గ్రేవ శ్రీవత్సమన్ క్రీనీడపై జాడ, హరియురస్సీమ గేహాజిరమున
శుంభద్భుజోన్నతస్తంభసంభృతవైజ, యంతికా గారుత్మతాశ్మశృంఖ
లామధ్యభాగప్రలంబమానానూన, కౌస్తుభమణిదీపకళికదీప్తి

తే.గీ. యిదిగోఁ గనునీమనోరథాభ్యుదయరేఖ, యనుచుఁ జూపింపనగ్గురుఁ డరసి మురిసె
సరసిజాననముఖసువర్ణైశ్వర్యదాత్రి, భువనజనయిత్రి నందు నంభోధిపుత్రి. ౧౮.

క. తిలకించి యకించనుఁ డిమ్ముల మించిన పెన్నిధానమును గాంచిన య
ట్టుల సంతసించి గీష్పతి, పులకించిన మేనితో సముత్సుకుఁ డగుచున్. ౧౯.

క. తల్లీ యోషిల్లోకమ, తల్లీ త్వల్లీలచేఁ గదా యవ్వాణీ
వల్లభముఖులెల్లను సం, పల్లాభోల్లసితులై ప్రవర్తిల్లు టొగిన్. ౨౦.

క. ముక్తాహారులు నవిరళ, ముక్తాహారులును సుహితభూరిరసోద్య
ద్భక్తులు నగుదురు గద త్వ, ద్భక్తులుగా గణుతిఁ గనినవారలు తల్లీ. ౨౧.

సీ. కడుపేదలై దస్సి కడుపేద నిల్లిల్లు, దిరుగువాఁడైన నీకరుణఁ గాంచి
వలువంతయును లేక వలవంత దైన్యంబుఁ, జూపువాఁడైన నీపాపుఁ గాంచి
నిలువనీడగఁ జూడ నిలువ నీస్థలియయ్యె, యొనరువాఁడైన నీనెనరుఁ గాంచి
మాఱుమానిసికి వేమాఱు మానసపుఁ బెం, పుడుగువాఁడైన నీయడుగుఁ గాంచి

యసమశాల్యన్నములయుఁ జీనాంబరంబులయును సముత్సేధసౌధంబులయుఁ గుటుంబ
పరిజనంబులయును బెంపు పరిఢవిల్ల, భూరిసామ్రాజ్యుఁ డగుఁ గదే భువనజనని !

క. అని యెన్నేనివిధంబుల, ననిమిషగురుఁ డిందిరామహాదేవిని జే
ర్కొని యామెను బ్రసాదంబునఁ దిరమగుసిరి నొసంగు పోఁడిమిఁ జూపన్.

క. మన కిఁక శాశ్వతసంపద, లొనగూడె నటంచు మోదమందుచు మఱియా
ఘనమూర్తి యితరలసదప, ఘనసందర్శన మొనర్పఁ గాఁ గడఁగుటయున్. ౨౪

గీ. పొందుగా నంతఁ గటినద్ధనందకేత, రాయుధచతుష్కమైన శ్రీహరిభుజాచ
తుష్టయమునందు నిలిచి సంతుష్ట మయ్యె, ననిమిషస్వామిగురువిలోకనచయంబు.

చ. కమలజసూతిఫాలఫలకంబులఁ బుట్టువుచంద మేకశా
లమున లిఖింప దాసపటలంబున కొక్కటఁ జక్కఁగాఁ బుమ
ర్థముల నొసంగ నాలుగిటిఁ దాల్చెనొకో యన నొప్పు శౌరిహ
స్తములకు మస్తకంబు వినతం బొనరించె గురుండు భక్తితోన్. ౨౬

గీ. కంధరాభిఖ్యభువనవిఖ్యాతి గాంచి, గర్జితసూర్జితధ్వని గణుతి చేఁ ద
నర్చువైకుంఠకంఠంబున కుపకంఠ, మున సముత్కంఠ గురుఁడు చూపులఁ గదించె.

క. మానసమున గురుఁ డాహరి, యాననరుచి నలువ గన్న యాననరుచిర
శ్రీనలరు దానిఁ గని యస, మానసముల్లాసభాసమానుండయ్యెన్. ౨౮

మ. దివిజామాత్యుఁడు స్వామికార్యఘటనాదీక్షైకదక్షుండు శ్లా
ఘ్యవివేకుండు పదాదిగాఁగ ముఖపర్యంతంబు నత్యంత భ
క్తివిశేషంబున నంబుజోదరునిమూర్తిం గాంచి సాక్షాత్కరిం
చె విరించాదికదుర్లభుం డనుచు నత్యున్నప్రమోదంబునన్. ౨౯

క. బడి బడి సాష్టాంగముగాఁ, బడి వడి మ్రొక్కులిడి లేచి పలునుడువులఁ బ్రా
నుడువుల నుడియడిదపుదొర, నుడుగక కడుభక్తిఁ బొగడుచుండఁగ హరియున్.

గీ. గీష్పతినిఁ గాంచి నీవు వాక్పతియును, సురలఁ గనుఁ జూడ నిటకువచ్చుటయె ఱెంగి
ధ్యానగమ్యుండఁ గానఁ బ్రత్యక్షమైతి, నీకు మాత్రంబె సురపాలనైకలోల.

క. మెచ్చితి నీనచ్చరితకు, వచ్చినపనిముచ్చటించి వర మడుగుము వై
యచ్చరకులదేశిక యన, నచ్చతురుఁడు విన్నవించె హరి కిప్పగిదిన్. ౩౨

గీ. ఏను వాస్తోష్పతియు సుర♦ లిటకు నిపుడ, వచ్చుట యెఱింగినట్టి స♦ర్వజ్ఞమతికి
దేవరకు విన్నపము సేయఁ♦గావలెనె మ,దీయవిజ్ఞాపనం బాది♦తేయవరద. ౩౩.

ఉ. శ్రీవర దేవరం గనుట♦చేతను జేతనులాజవంజవ
ప్రావరణంబువాసి సత♦తైనభవత్పదసేవనంబునం
బావను లౌచు నిత్యవిభ♦వంబును గాంచి సమంచితానుమో
దావహులై సదాసుఖితు♦ లౌదు రటంచు వచింత్రు కోవిదుల్. ౩౪.

గీ. అట్టిదేవరదర్శనం♦ బైనపిదప, వెత్తివాఁడైనఁ గోరునే♦ వేఱు వరము
నమృతవారాశిలో నోల♦లాడఁ గాంచి, గంజికై యాసపడెడి ము♦ష్కరుని కరణి.

కం. దేవర పాదసూపుట కా,దే వర మన వేఱె యున్న♦దే వరవరటా
దేవరథ సంయమీశ్వర, దేవరచితవినుతిపాత్ర♦దేవ రమేశా. ౩౬.

కం. నీ వొనరించినజగములు, భావింపఁగ స్వర్గమర్త్య♦పాతాళంబుల్
దేవమనుష్యాసురులకుఁ, దావలములు తత్క్రియంబు♦ దప్పునె యెపుడున్. ౩౭.

గీ. సంజ్ఞ త్రిదశాలయం బని♦స్వర్గమునకుఁ, దనరు బలిసద్మ మనుచుఁ బా♦తాళమునకు
నమరు నది యిప్పు డేల వ్య♦త్యాస మొందు, సత్యనిర్మాణ నీకటా♦క్షంబు గలుగ.

గీ. మాది మాకిచ్చుటయె మడి♦మాన్య మిదుట, యనుచుఁ బ్రాకృతుఁ గోరిన♦యటుల మిమ్ముఁ
గోర నేటికి మున్నెయె♦వ్వారి కెద్ది, యుచితమగు దాని నటు చేసి♦యుంటఁ జేసి.

కం. బలి శుక్రుని ప్రేరణమున, బలభేదిని స్వర్గపురముఁ♦ బాయఁగఁ జేయం
బలమఱి మీచరణంబులఁ, గొలువం జనుదెంచె నిటకు♦ గోవింద హరీ. ౪౦.

సీ. దితితనూభవదండ♦హతులకు దళశతాం,బకు వీఁపు నల్లుల♦మంచ మయ్యెఁ
బలశాశికుట్టాక♦ములకు వేఁడివెలుంగు, కొమరుని తల సంత♦కుండ యయ్యె
దైత్యకరాసిక్షు♦తముల కంబుధినాథు, మే నూరిదరిబొడ్డు♦మేడి యయ్యె
దనుజాంగుళీప్రపీ♦డనముల కర్థేశు, చెవిదోయి కన్నెర♦చీల లయ్యెఁ

తే.గీ. గొమ్ముటేనుంగులే ధావ♦న మ్మొనర్చ, నేమి చెప్పఁగవలయును ♦దోమలగతి
ననినగతిఁ గోణపులఁ బేరు♦కొనఁగ నేల, చెదరియొక్కొక్క మూలవా♦రౌదురపుడు.

గీ. దీనజనతార్తిసంహారి ♦దానవారి, శౌరి యనుఖ్యాతి నిల్పుకో♦సమయ మిదియె
శిష్టరక్షణ దుష్టసం♦శిక్షణములు, నీవు పూనిన పూన్కలు♦గావె దేవ. ౪౧.

మ. అనిసాష్టాంగముగా వడిం బ్రణతుఁడై యా దేవదేవాంఘ్రులం
దనమూర్ధంబున సోఁకుచున్ శరణు దైత్యవ్రాతగర్వాపనో
దనదీక్షాపర ప్రోవవే మము సురేంద్రత్రాసనిర్వాపణా
యనుచున్ లేవక యున్న శౌరి కరుణాయత్తైకచిత్తంబునన్. ౪౩.

గీ. అఖిలసజ్జనలోకాభయప్రదంబు, లైన నాల్గుభుజంబుల నతనిఁ బొదవి
లేవఁగా నెత్తి యిట్లను దేవమంత్రి, యీ యుపేక్షకుఁ గారణం బెల్ల వినుము.

చ. కులబలసంపదాదులు దగుల్కొనహత్తినమత్తవృత్తి యె
ట్టులు దొలఁగుం దదున్నతి కడుం దగుచుండినయంతవట్టుఁ ద
ద్బల ముడివోయి నప్పుడు గదా యిది యిట్టి దటంచు నాత్మలం
దెలివి వినీతి నీతియు విధేయతయుం సమకూరు నేరికిన్. ౪౫.

కం. ఋభువిభుఁ డితఁడు త్రిలోకీ, ప్రభుతాప్రభవప్రభూతపటువైభవగ
ర్వభరంబునఁ దజ్ఞత దప్పి భవానిప్రసాద మభిభవించెం బెలుచన్. ౪౬.

చ. ఒరుఁ గని యాదరింపమియె యొప్పదు తప్పగు విప్రుఁ జూచి స
త్కరణ మొనర్ప కున్కి కొఱగాదు తపస్వుల నెందుఁ జుల్కఁగా
నరయుట శైవులందు వినయంబె నయింపమికాని మాట వా
విరి మనయత్రినందను నుపేక్ష యొనర్చినఁ జెప్ప నేటికిన్. ౪౭.

శా. శర్వాణీకరుణానులబ్ధమనియా సన్మాలికావృత్తము
న్గీర్వాణేశుఁ డెఱుంగఁజాలఁ డట పోనీ దాని కేమయ్యె నా
సర్వేశాంశమునన్ జనించినమహాశైవుండు దుర్వారుఁ డీ
దుర్వాసుం డని మున్నెఱుంగఁడొ ప్రశస్తుం డయ్యె వ్యర్థంబుగాన్. ౪౮.

కం. ఆవరమునిశాపచ్యుతి, గోవిందుఁడె కలఁ డటంచుఁ గొనకొని సదయుం
డై వాక్రువ్వక యూరక, యే వెడలినఁ గ్రమ్మఱింప నెవ్వరి తరమా. ౪౯.

కం. ఐశ్వర్యదాత యప్పుర, మేశ్వరుఁ డని మోక్షదాత నేనని శర్వ
ద్విశ్వప్రఖ్యాతోక్తుల, విశ్వాసంబునను సంభవించునె యిడుమల్. ౫౦.

కం. ఏ నన నీశ్వరుఁ డన నింతైనను భేదంబు కలదె యదియెఱుఁగక దు
ర్జ్ఞానులుగొందఱు భేదము, గా నెంతురు వారి కెట్లు గలుగును సుగతుల్. ౫౧.

కం. నేనజుఁడనై సృజించెద, నే నినయై పెంచెద న్మహేశానుఁడనై
పోనడఁచెద వారలు ని, ట్లే నెరపెద రేది భేద మీమువ్వురకున్. ౫౨.

ఉ. మామకభక్తుఁ డెవ్వఁడో సమస్తము నాతఁడు మన్మయంబుగా
నేమదిలోఁ దలంచు నతఁ డెద్దియు భేదముగాఁ దలంపఁడే
మేమొ మదన్య మున్నదని యెంచినచో నిఖిలాత్మభావము
న్నేమి ఘటించు నాకపుడు లేదుకదా తగుదారి వానికిన్. ౫౩.

కం. ఈశ్వరభావనచే న, నైశ్వర్యంబునకుఁ గొలిచి యావ్వలి నిత్యా
నశ్వరసుఖమునకై గరు, డాశ్వునిఁగఁ దలంచి కొలువనగు వాంఛాప్తుల్. ౫౪.

గీ. ఈశ్వరానుగ్రహము లేని యెడ నొకండు, శాశ్వతైశ్వర్యముల నొందఁ జాలఁ డెపుడు
నాయనుగ్రహమును గోరె నా తదీయ, విత్తము హరింతు నిది లోకవిశ్రుతోక్తి.

మ. సిరి సంపూర్తిగ నున్నవేళ మదవచ్చేతోభిమానంబునం
బరమార్థ మ్మొక యింతయైన మదిలో భావింపఁగా లేక ము
ష్కరులై కొందఱు కన్నుఁగాన రదివోఁ గాంక్షింతు రింకెవ్వఁడే
వ్వరిమూలంబున వెండియుం గలుగు సంపల్లాభమంచార్తులై. ౫౬.

కం. ఇంకేల పెక్కునుడువులు, శంక యొకింతయును లేక చనుఁ డిపుడు నిరా
తంకముగఁ బంపెదను మీ, సంకటములు దీఱ బలి రసాతలమునకున్. ౫౭.

కం. నావుడు గురుఁ డిట్లను నో, దేవా దేవాధిపాది దివిజావళికిన్
భావత్కపాదదర్శన, భావుకము నొసంగవలయు భక్తార్తిహరా. ౫౮.

కం. ఓదేవ వారికిని మీ, పాదాంబుజరసముఁ గ్రోలు భాగ్యము దొరకం
గాఁ దలఁతు నిపుడ యేక, స్స్వాదునభుంజీత యనెడు వాక్యము వినుటన్. ౫౯.

కం. పలుమఱు శ్రీహరిగురునిం, దలఁపు తెలుపు మనిన నింద్రు నాకమునందు
న్నిలుపు మని కోరె స్వార్థముఁ, దలఁపరు కద స్వామికార్యతత్పరు లెందున్.

కం. అన నవ్వుచు వటుకాని, మ్మని హరియు ననుగ్రహింప నాంగిరసుండుం
దన పిఱిఁది సురల కరిదిగఁ, గనుఁగొనుఁడని చూపి చెప్పఁగాఁ గట్టెదుటన్. ౬౧.

మ. కని రింద్రాదిసురు ల్ముకుందుని బయఃకల్లోలమాలావృష
ద్ఘనముక్తాఫలచారుతోరణలస త్కాదంబినీకాయమా

ననితాంతాంచదనంతమంటపగతా•నంతస్ఫటానంతశో
భనశయ్యాంతరశాయి భక్తగణసం•పద్దాయి నెక్కొమ్మడీ౯. ౬౨.

కం. కని సాష్టాంగప్రణమిత,తనులై భక్తిప్రసక్త్య•తనులై గతయా
తనులై సఫలచిరప్రయ,తనులై వినుతించి రివ్వి•ధంబున వరుస౯. ౬౩.

కం. నలువకు నిది యీాదృశమని, పలికి నిరూపింప వలను•పడ దెద్దియొ యా
వెలుఁగుంగనుఁగొంటిమియిక౯, గలుగదుకదవొసఁగుటిగ్గుఁ•గడలుకొనంగ౯. ౬౪.

గీ. జలధిపాత్రపయస్స్నహా•సర్పరాజ, వర్తిఫణమణిదీపాగ్ర•వర్తికజ్జ
లప్రభునజాండభాండజా•లప్రభునినుఁ, గంటిమోహాంధవృత్తిఁబోఁ•గంటినధిప.

గీ. కృష్ణవర్త్మాహ్వయంబు నా•కింతవట్టు, మలినమార్గుండ నగుటచేఁ•గలిగెఁ గాని
కృష్ణ నినుఁ గాంచుదారి నే•నిపుడు కనుట, నలరె నిర్దుష్టసాధ్వర్థ•స్థమకుంద.

గీ. దితిజగణభయరోగాధ•మత వహించ్చుటను గదా నే గదాధరుం•డ నను పేర
నుంటినింతకుమునుగదా•యుధవహింతు, నిఁకగదాయుధధారినా•మక యశంబు.

కం. అజ "నేతిబీర" వలెఁ బుణ్యజనుం డని నాదు పేరు•వ్యర్థము సుమ్మీ
ప్రజ లెఱుఁగ నింతదనుక, న్నిజమవిసంవాది యయ్యె•నేఁ డది నాథ౯. ౬౮.

ఉ. కట్టడిఁ దొట్టి దానవని•కాయము కాయమునందు హస్తము
లట్టిగఁ బట్టి పాశములఁ•గట్టుటఁ బట్టి జగం బెఱుంగనే
బెట్టుగఁ బాశహస్తసమ•భిఖ్యవహించితి నిన్నినాళ్లునా
కట్టి సడి న్మడి న్వడువ• నయ్యెఁ గదయ్య ముకుంద యియ్యెడ౯. ౬౯.

ఉ. నాదు మహాబలుం డనెడు•నామము మిక్కిలి సత్త్వహీనుఁడ
న్వాదు ఘటించె దైత్యబల•వర్గబలార్భటి కాఁగ కేదిటం
బేది పలాయనప్రవణ•వృత్తిభజించుట నింతకాలమో
శ్రీదయితా భవత్కరుణ•చే నిపు డొందె బలాధికార్థము౯. ౭౦.

చం. దనుజులు బల్మిఁ గల్మిఁ గొని•దర్పమునం బురమాక్రమింపఁగాఁ
గనుకని భీతిఁ బర్వ నల•కావిభుఁడం చొరు లింత కాలము
న్ననునల కుత్సితప్రభుఁ డ•నం దగు నర్థముఁ దోఁపఁ బిల్వనుం
టిని గద యింక నీకరుణ•నే నలకేశ్వరసంజ్ఞ నొందెద౯. ౭౧.

కం. కరికృత్తివసనత చేఁ, బరఁగితి మున్నుఁ గృత్తివసనుఁడన నే
డరిహృతసర్వస్వత చే, ధరియించిన యక్కొలంతఁ దప్పెఁగద హరీ. ౭౨.

కం. అని యింద్రాదిదిగీశులు, తన తన పడినట్టి కష్టదశ లిట్లెఱిఁగిం
చి నుతించి రేకముఖముగ, నెనసి పురస్థాయిఫణధరేశ్వరశాయిన్. ౭౩.

దండకము—శ్రీ మన్మహానర్ఘరత్నచ్ఛటోదారకోటీరకోటీరవిజ్యోతిరాటీకనోద్గీర్ణవ
పశ్యద్ఘనధ్వాంత విభ్రాంతికృత్కుంతలాత్యంత కాంతాళికాంతాభి రామాననా
యిందిరామాననాధీన నానాజగద్వల్లభా గల్లభాస్వన్మణీమండలాఖండలాలిత్య
భాకుండలా కుండలీశానతల్పా యురస్థాయితల్పా సదానిర్వికల్పా కనత్కౌస్తు
భాకల్పకా సత్యసంకల్పకా భక్తబృందాలయాళిందకల్పా యనల్పానుకంపా
మతీ భూరిశంపాతతిద్యోతమానాంబుదాడంబర శ్రీసమాలంబిజాంబూనదా
చ్ఛాంబరాంగప్రభా సుప్రభావా శుభావాస వాసంతవేళాప్రఫుల్లప్రసూనప్రతా
నోల్లసన్మల్లికావల్లికాకారరేఖానఖాళీమయూఖా ప్రజాభంగగంగానుషంగాం
ఘ్రిపద్మద్వయా యద్వయా చిద్విలాసా కలాసాదరా ఖేదరాహిత్యకృత్యాతి
పాండిత్యనిత్యాదరా మేదురామోదదామోదరా పాదసేవైకహేవాకభావాకలంక
స్థితింబొల్చులోకంబులోకంబుహస్తా నిరస్తాఖిలాంహస్తమస్తోమవృత్తిన్సమస్తప్ర
శస్తప్రకర్షోపపత్తిం బ్రవర్తించి యంచద్వివేకాతిరేకంబులై యంబుజప్రోద్భ
వాదుల్నిరూపింపఁగా లేనివిజ్ఞానసంపత్తికిం బాత్రభూతంబులై సర్వభూతప్రకృ
ష్టానుభావంబుచే విశ్వభూతప్రభూ! తత్క్షణంబే నమద్రక్షణాక్షీణవైచక్షణీ లక్షి
తాక్షుద్రదాక్షిణ్య మా నీకటాక్షప్రసారంబునుం జెంది యానందమున్ బొందుచు
న్ఘోరదుర్వారనిస్సార సంసారకూపారపారంబునుం జేరి నీదౌపరత్వస్వరూపంబుఁ
బ్రాపింపఁగా నోపు నోపుండరీకాక్ష యీయక్షయాజాండభాండంబులం గుక్షి
నిక్షిప్త విక్షిప్తముల్సేసి రక్షించుదీక్ష ల్నిరీక్షించు నీ వేల నీవేల నీవేల నుద్వేల
దుర్విక్రమాభీల విద్విట్కృతోద్వేగయోగార్తి ఘోషించుమమ్మేల రాకుందు
వంచుం గడు న్నమ్మి యుండం గృపాయత్తచిత్తంబునం దత్తఱం బంద నీకుండ
నీవ్యూహలీలాసముత్సాహ మాదివ్యదేహంబు దర్శించు భాగ్యంబు మాకుం బ్రసా
దించితే నింతకు న్మున్నుగా నెన్నిరో వైభవోదాత్తలీలావతారంబులం బూర్ణ
తిర్యక్స్వరూపంబుగా నర్ధతిర్యక్స్వరూపంబుగాఁ జూపి శాపిష్ఠరక్షఃకృతోప

ప్లవంబు న్నివారించి తీవింక మాయంకిలిం దీర్పఁగా నిప్పు డొక్కింత యేదేని
యుం బిన్నవైయున్ననుం బన్నుగాఁ జెన్నుగా వన్నెఁ గాన్పించి వర్ణింపఁగా
వర్ణియౌనట్టిరూపంబుచే నేవు దీపింపఁగా నోపరంధామ యుద్దామసా
మర్థ్యముం జూపవే పాపము ల్బాపవే యాపదుద్ధారకా కోపకాపట్య
నిస్తారకా సచ్చిదానందకందా సదాస్పంద గోవింద మమ్మం దరిం జేర్చి కాపా
డవే దేవదేవా నమస్తే నమస్తే నమః. ౨౪.

మం. అని యాసర్వసువర్వు లాత్మదశ లా•త్మాభీష్టము ల్విన్నవిం
చిన భక్తాభయదానదక్షుఁ డగుల•క్ష్మీవక్షుఁ డబ్జాక్షుఁ డి
ట్లనియె న్వారలఁ జూచి మీచిరతరా•యాసంబు లిం కుండునే
చనుఁడీ మీరలు మీయథాగతముగా•నంత్యక్తసంత్రాసులై. ౨౫.

కం. అన విని యోగీశ్వరు లి, ట్లనియె న్నీ వానతిచ్చి•నది వరమే యై
నను సైరింపఁగవలె నొక, మనవి నొనర్చెద మరుత్స•మాజశరణ్యా. ౨౬.

కం. దేవరసంకల్పంబ క, దే విశ్వోత్పత్తిసంస్థి•తిలయంబులనం
గేవల మఘటనఘటనా, ప్రావీణ్యాత్మున కొకింత• పనియే యిదియున్. ౨౭.

కం. చనుఁడిఁక శ్రమముండునె మీ, కనినంతనె వెఱపు దొలఁగు• నట వే యన్నం
బనినం దీరునె యాఁకలి, తిని తనియక యున్నచో క్షు•ధితునకు నెందున్. ౨౮.

ఉ. నేరము నేరు పెంచకుము• నేరము నీకడఁ గోర్కెఁ దెల్ప నీ
వారముగాన నిట్లు బహు•వారము దెల్పఁగఁ జెల్లె మాకు నీ
సారముఁ దొల్లి చూపితి వి• సారముఖోత్తమదివ్యమంగళా
కారము లూని యిప్పు డుప•కారము నే తను వూని సేసెదో. ౨౯.

కం. ఎప్పటి కెప్పగిదిని మ, మ్మెప్పటి వలెఁ బాదు కొల్పె• దెఱిఁగింపుము మా
యప్పా దార్ఢ్యస్థితికై, యిప్పాటనభీతమతుల• కెఱుఁగఁగ వలసెన్. ౩౦.

గీ. ఏను జీవుఁడ ననియు నీ•వీశ్వరుండ, వనియు రూఢార్థసంజ్ఞవి•ఖ్యాత మగుట
మృద్ఘటస్వర్ణభూషోప•మేయ మగుచు, మనకుఁ దనరారుఁ గాదె సం•బంధ మీశ.

చం. అన విని జీవుఁ గాంచి పర•మాత్ముఁడు వల్కె దయాత్ముఁడై స్మితా
ననమున సంజ్ఞ రూఢమయి•న న్మతి యౌగిక మైన నేమి న

స్గనుఁ గద వాఁడు భేద మని కాని యభేద మటంచుఁ గాని యీ
వ్వనిమతి జీవుఁ డీశ్వరుని భాస మటంచు దృఢత్వ మందునో. ౧౩.

గీ. ఏలకామ్యార్థులైనమీ కిపుడు మోక్ష, సరణి యిట్టిది యని తెల్పఁ జాలదొక్కొ
యింతమాత్రంబెయీ తెల్వి దృఢముగాఁగ, మదిఁగుదురుకొన్న నో బుధ మాన్యచరిత

గీ. క్షణికమదమాత్రమున నిట్లు సంభవించె, నధిగతసుధర్ముఁ డైనబు ధాధిపతికె
నిత్యమదమత్తులకు నెట్లు నిల్చి యుండు, ననిశముగ స్వర్గభోగమ య్యసురులకును.

క. అని యింద్రువంక మొగమై, వనజాక్షుం డాన తిచ్చె వాంఛాలాభం
బొనగూడు నె తపమునఁ గా, కనఘుం బది సకలవాంఛి తార్థము లొసఁగున్.

మ. స్థిరమై నెప్పుకళింగమండలమునన్ దివ్యస్థలం బస్మదా
దరణీయం బఖిలేష్టదాయకము సిద్ధక్షేత్రమై తార్క్ష్యభూ
ధర మష్టాక్షరిమంత్రరాజము సముద్యన్నిష్ఠ నచ్చోఁబురం
దరభక్తిన్ జపియించు నాతనికిఁ జేతం జిక్కు నష్టార్థముల్. ౧౬.

కం. నీవచ్చో మితకాలం, బావిర్భూతప్రపత్తి నమ్మంత్రజపం
బావర్తించిన మదిలో, భావించినవాంఛితార్థ ఫలము లభించున్. ౧౭.

గీ. అని యనుజ్ఞ నొసఁగి యాంగిరసుని గాంచి, వనజనాభుఁ డిట్లు లనుచు నాన
తిచ్చె నేము నిశ్చ యించినకర్జంబు, లెల్ల నొకట నిర్వ హింపవలయు. ౧౮.

సీ. వచ్చినదారిగా వరుసదైత్యుల నెల్లఁ, బాతాళమును జొరఁ బనుచు టొకటి
మీమీపదంబుల మిమ్ము యథాపూర్వ, ముగ సంప్రతిష్ఠించు పూన్కి యొకటి
నను సుతుఁగనఁదపం బును బూనర్చెదునయ్య, దితి కశ్యపులకోర్కి దీర్చుటొకటి
తార్క్ష్య శైలాఖ్యసి ద్ధక్షేత్రమహిమంబు, స్థిరముగా వెల్లడి చేయు టొకటి

తే.గీ. యిన్నియునుమాదువైదగ్ధ్య మెఱుకపడఁగ, నొక్కటరచింపనవతార మొందుహార
మేముమీకోరినట్టుల యిపుడ పిన్న, యనఁగ వర్ణియనంగ మీ రరుగుఁ డనిన. ౧౯.

ఉ. దేవ మహాప్రసాద మని ధీరమతిం దగ సాఁగిమ్రొక్కి చో
నావనమాలి కన్మొఱఁగె నంత సుర ల్దలి దంద్రులందముం
గావరె యంచు నయ్యదితి కశ్యపులం గని తెల్ప గారుడ
గ్రామముఁ జేరి బంధురన రస్తటసీమ వసించి రందఱున్. ౨౧.

గీ. ఇట్టులద్దేవి సేవించి ♦ ఋషివరుండు, పనివినెదునప్పుడా మెయి ♦ ట్లనుచుఁ బలికె
మెచ్చితిని గోరుకొనుమయ్య ♦ యిచ్చెదాన, వరము నెద్దియునైనని ♦ క్కరమునీంద్ర.

గీ. అనిన విని యామెతోడ ని ♦ ట్లనియె మునియు
నంబ నవ్వీతరాగుఁడ ♦ నని యెఱింగి
యును వరముఁ గోరికొను మటం ♦ చును వచించి
తరయ నవ్వీతరాగుఁడ ♦ ననియె చెపుమ. ౪౭

కం. ఐన నొక కోర్కి కలద,మ్మా! నామది రామనామ ♦ మంత్రమ్మునకున్
ధ్యానాద్యుపాసనల కే, వైన విశేషంబు లున్న ♦ నవి విన వలతున్. ౪౮

మత్తకోకిలము.— నావుడుం దరహాసముల్ వద ♦ నంబునన్ వెలయించి యా
దేవి యమ్మునిఁ గాంచి యిట్లని ♦ తెల్పెఁ దారకమంత్రమం
దేవిశేషము లున్నవో పర ♦ మేశ్వరుండు మదీశ్వరుం
డే వచింప వలంతి గా కొరు ♦ లెవ్వరైన సమర్థులే! ౪౯

గీ. పరము వేఁడు మనుచు ♦ బలవంత మొనరించి, యడుగనిడఁగఁ జాల ♦ కుడుగ వలసె
నైన నాదునుడువు ♦ వ్యర్థం బొనర్తునే, తగినవెరవుఁ దెల్పు ♦ దానఁ గాక. ౫౦

గీ. మునిజనవరేణ్య కాశికా ♦ పురమునందు, విశ్వనాథుండు మన్నాథుఁ ♦ డీశ్వరుండు
రామనామప్రబంధకీ ♦ ర్తనము వినినఁ, దన్మహామంత్రరాజత ♦ త్త్వంబుఁ దెలుపు.

తరలము. అనవుడు న్ముని దేవి కిట్లను ♦ నమ్మరో! విను మమ్మ! నా
మనవి నే నిపు డిట్టు లయ్యుప ♦ మాక వేంకటనాథు సే
వన మొనర్చు కడంకమైఁ జను ♦ వాఁడనై నడుద్రోవ నిన్
గని కృతార్థుఁడ నైతి మోదము ♦ గంటి ఖేదము గంటితిన్. ౫౨

ఉ. ఇమ్మహి వేంకటేశ్వరుని ♦ యిమ్ములు నాల్గు చెలంగు దివ్యదే
శమ్ములు సేవలమ్ముఁ గలు ♦ షమ్ములఁ బాపఁగ నోపు నర్థవా
ద మ్మిది గాదు శేషగిరి ♦ ద్వారక నావురి గారుడాద్రి స
త్యమ్ము ప్రసిద్ధసిద్ధనిల ♦ యమ్ము లభీష్టఫలప్రదమ్ములున్. ౫౩

కం. ఆనాల్గుదివ్యపదముల,లో నెవ్వఁడు తప మొనర్చు ♦ లోకజనిత్రీ!
వానిది యగుఁ దప మల రే,వానదితటిఁ జేయుతపము ♦ వలె నిడు ఫలమున్. ౫౪

కం. ఆవేంకటవిభునెలవుల, కేవారలు నైన యాత్ర ♦ కేగుదురో వా
రావెనుక నితరయాత్రలు, గావింపఁగ రా దటంచుఁ ♦ గల విలుఁ బలుకుల్. ౫౫

సీ. కావున నిచ్చోటఁ గడచి రెవ్వారలనికిఁ, జనఁజన దని కొంత సందియంబు
నచట నమ్మంత్ర మత్యల్పమైన జపింప, నగు సిద్ధి యనుచుఁ గొండంతయాస
కోరికొమ్మని యాసఁ గొల్పి లేదన నెప్పు, నే యని యడుగ నీయెడ భయంబు
నీమెకే తెలుపఁ డాయీశుండు నాకట్టు, లెఱిఁగించు ననుచు నిస్పృహత గొంత

తే.గీ. "పెట్టఁజాలక యుండినఁ బెట్టునిల్లు, నైనఁ జూపింప వలయు" నన్నట్టు చూపి
తీవటంచు సమాధానవృత్తి కొంత, కలిగి నాడెంద మివ్వేళఁ గలఁత నొందె. ౫౬.

మ. అన మందస్మిత మొప్ప దేవి కరుణాస్వాంతంబుతో మాని కి
ట్లనియె న్గమ్యము దక్క నిన్నడుమఁ బుణ్యక్షేత్రముల్ రెండొగిం
గనుపట్టుం గద ద్వారకాపురియు నాకాపల్లియు న్వేంకటే
శనివాసంబులు సిద్ధసేవ్యములు శశ్వద్విశ్వసంభావ్యముల్. ౫౭.

కం. రేవాతీరతపంబును, శ్రీ వేంకటనాథుఁ డుండు క్షేత్రంబులలోఁ
గావించుతపంబును సరి, యై వెలయు న టన్ననుడి యథార్థము గాఁగన్. ౫౮.

ఉ. గౌతమియొడ్డునం దప మఖండఫలప్రద మంచుఁ గోవిద
వ్రాతము పల్కుచుంట వినవా మన వామనవామదేవుల
ప్పూతమహాస్రవంతి కిరుపొంతల నాజలరాశి గాఁగ నా
త్రేతరదేవత ల్గొలువ నిచ్చ వసించిరి పెక్కురూపులన్. ౫౯.

కం. నారద భద్రాద్రిస్థిత, తారకమంత్రాధిదైవత శ్రీరామో
దారపదోదకపావన, యై రాజిలు గౌతమీమహానది యెల్లన్. ౬౦.

గీ. దేవతను బట్టి క్షేత్రంబు దివ్యమగును, దీర్థమును క్షేత్రమును బట్టి దివ్యమగును
ద్రితయ మొక్కెడఁ గూడిన దివ్యదేశ, మిద్ధరిత్రి నిదే కద సిద్ధపము. ౬౧.

కం. అకరణి దివ్యపదమగు, నాకాపలి యందు రామనామజపం బీ
వేకాగ్రవృత్తిఁ జేసినఁ, జేకుఱుఁ దన్మంత్రవిధ మశేషముగ వెసన్. ౬౨.

సుగంధివృత్తము. ఓతపస్విలోకనాథ యుగ్రమాతపంబు నీ
గౌతమీస్రవంతిఁ జేయఁగా దయార్ద్రచిత్తుఁడై
శ్రీతివేంకటేశ్వరుండు పెంపుమైఁ బ్రసన్నతన్
నీతలంపుఁ దల్పు సాధునీవతంస మిట్లనన్. ౬౩.

శా. నాళీరంబున సంవసించి కరుణ ♦ న్నాకావిహారంబుల
న్నాతోయంబుల సంచరించుచు నను ♦ న్మన్నింపవే యంచు నా
స్రోతస్విన్యవతంస మీప్సితపుదీ ♦ రుం దెల్పనల్పేతర
ప్రీతిం దా నివసించెఁ దత్తటమునన్ ♦ శ్రీవేంకటేశాకృతిన్. ౭౪.

గీ. అట్టు లాతఁడు వసియించి ♦ నట్టిదేశ, మోడపల్లె యనంగఁ బే ♦ రొంది వెలసె
నందుఁ దపమాచరించిన ♦ యట్టివారి, వాంఛ లీడేర నాహరి ♦ వర మొసంగె.

గీ. అందుఁ గొన్నాళ్లు నియతి నీ ♦ వధివసించి
యరుగు మవ్వలి దరికిఁ గా ♦ ర్యార్థ మగుచు
వచటి కెదుటను దోఁచుఁ బు ♦ ష్పాద్రిపద్మ
శైలధవళాచలములు ని ♦ ర్ఝరమునీంద్ర !

సీ. గోదావరీవారిఁ ♦ గోటిలింగేశ్వరు, భక్తియుక్తిగ నభి ♦ షిక్తుఁ జేసి
తత్పార్శ్వవర్తిసీ ♦ తారామమూర్తిఁ దారకనామదివ్యమం ♦ త్రమునఁ దనిపి
తద్వామ్యభాగసం ♦ స్థాయిమార్కండేయ, శంభులింగము సమ ♦ ర్చన మొనర్చి
తద్దక్షిణమ్మున ♦ ధవళాద్రిశ్రీజనార్దనుఁ గొల్చి రామపా ♦ దముల కెఱఁగి

తే.గీ. యవలఁ దూర్పుదెసకు ♦ నై యోజనత్రయ, దూర మరిగి యచటఁ ♦ దుల్యదరిని
వెలఁగుచున్న యట్టి ♦ శ్రీకుమారారామ, సీమ భీమనాథు ♦ సేవఁ జేసి. ౭౭.

కం. అందుండి పీఠపురమున, కుం దరలుము కుక్కుటేశు ♦ కోవెల నడుదా
రిం దోఁచు గవని మ్రోలఁ గ, నం దగు నందీశకేత ♦ నస్తంభముతోన్. ౭౮.

కం. ఆదివ్యక్షేత్రంబున, నీదగుకోరిక లభించు ♦ నిక్కంబుగ నీ
కేఁ దెల్పునుపాయం బదె, యోదైవతమునివ రేణ్య! ♦ యురుతరపుణ్యా! ౭౯.

చం. అది యెటు లన్నచో నొకయు ♦ పాయముఁ దెల్పెద నంటి మున్నె యా
సదయునివిశ్వనాయకుఁ బ్ర ♦ సన్నుని జేసికొనంగఁ గాశికై
యది పని గాఁగ నేగవల ♦ దంతట నాతఁడు నిండియుండు నా
రద! జగదంతరాత్మయని ♦ ప్రాజ్ఞులు పల్కఁగ నాలకింపవే. ౮౦.

శా. కైలాసంబునుఁ గాశికానగరియుం ♦ గాణాచిగా నాతఁ డే
లీలం దా వసియించియుండు భువి నా ♦ లీల న్వసించెం గదా

యేలాతీరమునందుఁ బీఠపురి దేవేంద్రార్థసిద్ధ్యర్థమై
వాలాయంబుగఁ గుక్కుటాకృతి స్వయంవ్యక్తాచ్ఛలింగంబునన్. ౭౧.

శా. ఆకాశీపురి యాదిమం బిది ద్వితీయం బంచు విశ్వేశ్వరుం
డో కంజాతభవాత్మజాత ! సతతం బుల్లాస మేపారఁగా
శ్రీశైలాసమునందుఁ బోలె నివసించెం గుక్కుటాకారుఁడై
లోకానుగ్రహకాంక్షఁ బారిషదపాళుల్ సేవఁ బొల్పారఁగాన్. ౭౨.

సీ. భాగీరథి యటంచు వచియింతు రచ్చోట, నేలానది యటంచు నిచటఁ బేరు
బిందుమాధవుఁ డంచుఁ బేర్కొందు రచ్చోటఁ, గుంతిమాధవుఁ డంచు నెంతు రిచట
మణికర్ణిక యటంచు గణుతింతు రచ్చోట, ఖ్యాతి యిచ్చటఁ బాదగయ యటంచు
నన్నపూర్ణ యటంచు నెన్నుదు రం దిందు, శ్రీరాజరాజేశ్వరి యని కీర్తి
తే.గీ. యందు విశ్వేశ్వరుం డందు రిందుఁ గుక్కుటేశ్వరుం డందు రంతె కాశికింతయైన
భేదమున్న దె కాశికిఁ బీఠపురికి, సంజ్ఞలే భేదములుగాని సన్మునీంద్ర. ౭౩.

కం. అది యైదుక్రోశముల నిడుపిది యామడవర్తుల మగు నెటుఁ జూచిన న
య్యది యిది పరమేశ్వరునకు, సదనంబులు భుక్తిముక్తిసంస్థానంబుల్. ౭౪.

శా. మున్నాటర్వది దేవతాయతనము ల్పొల్పొందు నవ్వీటిలోఁ
కన్నారన్నలుతట్ల యూపముల హాసింజెంది యేలాతటిం
గన్నారం గన సౌధయూథము లసంఖ్యాతంబు లవ్వీథులం
దన్నం దన్నగరీప్రభావము దరంబే యేరికి న్నారదా ! ౭౫.

ఉ. తారకమంత్రముం గురుఁడు దా నయి మానుగ నిచ్చుటన్ జనుల్
దారకలంకులై మనఁగఁ దవ్వక యొవ్వగ నివ్వరంబునం
దారకవిద్విషద్గురుఁడు దా నుపదేశ మొనర్చు సత్కృపా
దారకటాక్షుఁడై శిశుతయాదిగ నైహికసౌఖ్యము ల్గనన్. ౭౬.

ఉ. ఓదివిజర్షివర్య! పురుహూతికపేరిటిశక్తిపీఠ మ
ష్టాదశపీఠులం దిది నిజంబుగ నెన్నఁ బిత్యాణముక్తికిం
బాదగయాఖ్యతీర్థము విభాసిలు నిందు గయాత్రయి న్నతి
శ్రీదుని గుంతిమాధవు భజింపఁగ నా నిటఁ బంచమాధవిన్. ౭౭.

కం. గంగానది గోదావరి,యుం గావేరియును గృష్ణ•యును బోలిక( జే
యంగా( దగ వేలేటికి, బంగారమె వండు దాని•నాఃపూరములన్. ౭౮.

చం. జనములు గుంతిమాధవని•శాంతసుదర్శనదర్శనంబు చే
సిన మును చేసినట్టివి య•శేషముగా నఘము ల్నశించు న
వ్వనజదళాయతేక్షణుని • పాదసరోరుహదర్శనంబు( జే
సినఫల మిట్టిదింత యని• చెప్ప(గ శక్యమె నీ వెఱుంగవే. ౭౯.

చం. పొరి(బొరి లేచి ప్రత్యహము( • బ్రొద్దున( బుష్కరిణీజలంబులం
బరువడి( దీర్థమాడి జిగి•పట్టుమడుంగులు గట్టి యొప్పుగా(
దిరుమణికాపు దీర్చికొని • దివ్యతరద్రవిడప్రబంధభా
స్వరనినదాస్యులై తగ( బ్ర•పన్నులు గోవెల( జొత్తు రేడ్తెఱన్. ౮౦

శా. సేవాకాలమునందు నందు నలల•క్ష్మీజానికైంకర్యముం
గావింపం బఱతెంచి యొక్కమొగి భ•క్తశ్రేణి నిత్యంబు న
ధ్యావాసంబున భక్తిచే నుభయసే•దాంతజ్ఞు లధ్యాపకు
ల్దేవం జేయు ప్రబంధఘోషముల నా•లించుం బ్రమోదంబునన్. ౮౧.

సీ. సిరి యురంబున వసుం•ధరయు నీలయు నెమ్మి, నిరుప్రక్కలవసించి•మురువు(జూప
శంఖచక్రగదాసి•శార్ఙ్గాయుధంబులు, మూర్తిమంతంబులై • ప్రోల( దోఁప
పైన శేషుండు వి•ష్వక్సేనుఁడును భక్తి(, గేలోయి పెంగిచియుం•గిటను గొలువ
వివిధోపచారముల్ • పవరించుచును శేషు(, డన్నివంకల( దాన•యై భజింప
తే.గీ. సురలు బ్రహ్మేంద్రసహితులై •చుట్టు నిలువ( బ్రత్యహము( గుంతిమాధవ•స్వామి కెలమి(
బార్వతీవరమేశ్వరు • ల్వచ్చి నెఱవు, రాజభోగంబు( గనుట దు•ర్లభము సుమ్ము.

సీ. మును మున్ను మాధవ • పుష్కరిణీవారి(, దీరంబు లాడి య•ద్దేవు( గొలిచి
యావెన్క( బాదగ•యాస్నానుడై హస్తి, ముఖు( గాంచి దక్షిణా•మూర్తి నరసి
షణ్ముఖు సేవించి • చండీశు భావించి, భైరవు భజియించి • ధ్వజవితర్ది
కలన నాత్మప్రద•క్షిణముల నొనరించి, నందీశు నానతి • నొంది లోని
తే.గీ. కేగి యచ్చట శ్రీకుక్కు•టేశు( బరమ, భక్తి నభిషిక్తునిగ( జేసి • ప్రస్తుతించి
రాజరాజేశ్వరీదేవి( • బూజనముల, సలిపి నా( డందు నివసింప•వలె జనుండు

శా. సాయంకాలమునందు నందుఁ బురవా♦స్తవ్యుల్ సురస్తవ్యుఁడౌ
నాయీశానుని సేవనార్థులయి భ♦క్త్యావేశ మేపార యా
తాయాతస్థితిఁ గూర్చి సందడి కమ♦ర్త్యశ్రేణి దాదవ్వులం
దే యుండుం దమ వ్యోమయానములతో ♦ నింగి న్నిరీక్షించుచున్. ౨౭.

గీ. ఇతరులగు వేలుపులను ప్ర♦త్యేకముగను, దత్తదాలయములఁ జూడఁ♦దగుఁ గడంగి
యుండగా నున్న న్నినాళ్ల ప్ర♦త్యహమునందు, నరయవలె రేపు మాపు శ్రీ♦హరినిహరుని.

సీ. వాణి వీణియఁ బూని♦ రాణతో వాయింప, విబుధేంద్రుఁ డింపుగా ♦ వేణు వూదఁ
గమలజుం డనుకూల♦గతిఁ దాళమును మీట, నాళీకనిలయ గా♦నంబుఁ జేయ
గంభీరముగ మృదం♦గము శౌరి మ్రోయింప, ననిమిషశ్రేణి చు♦ట్టు నివసింప
నచ్చరల్ క్రమలయ♦న్యాసంబుఁ బరికింప, బ్రహ్మర్షు లానంద♦పరత నుండ

తే.గీ. రాజరాజేశ్వరీదేవి ♦ రత్నఖచిత, సింహపీఠికఁ గొలువుండి ♦ చిత్తగింప
సాంధ్యవేళలఁ గుక్కుటే♦శ్వరుఁడొనర్చు, తాండవముఁ జూడఁ గన్నుల♦పండువగును

ఉ. ఆనటనావసానసమ♦యంబున నల్లన విశ్రమార్థ మీ
శానుఁడు దేవితోడ వల♦చక్కినిఁ జక్కఁగ నేకపీఠికం
దా నివసించి యుండఁ బ్రమ♦థద్వితయం బిరుగట్లఁ జామరల్
పూని విభూషణంబులకుఁ ♦ బొందగు విందుగ వీచుచుండఁగన్. ౨౮.

గీ. పీఠమూలంబున వసించి♦ వినయవృత్తిఁ, దనయులిరువురుఁ బదములొ♦త్తంగ ముదము
గదురఁ గొండొకసేపందుఁ♦ గరుణ నిలచి, కొలువుఁ గావించు నందఱఁ గలయఁగనుచు.

మ. స్మిత మొప్పన్ శశిమౌళి భృంగి దెస నీ♦క్షింపం దదిచ్ఛన్ సభా
గతు లెల్లం గడుఁబొర్లి నవ్వఁగఁ జమ♦త్కారంబుగా నాతఁ డం
చితమౌహాస్యకళావినోదముఁ బ్రపం♦చింపంగఁ గొండొక్కసే
పు తగన్ లీలఁగఁ జిత్తగించి విలస♦న్మోదాత్ముఁడై పిమ్మటన్. ౨౯.

శా. దేవి న్నవ్వుచుఁ గాంచి యంతటను నం♦దిం జూడ నాతండు నుం
ప్రావీణ్యంబును జూపు వేడుక సుమా♦మాణిక్యవీణాగుణా
రావశ్రీ దన కంఠరాగమునకుం ♦ బ్రాపై విజృంభింప భా
షావామాక్షియు మెచ్చఁ బాడి విభునా♦జ్ఞం జెంది చాలించుచోన్. ౩౦.

చం. అమరమునీంద్ర! మంచిసమ•యం బది నీ కవు డీవుఁ జక్కఁగా
నమరిచికొన్నవీణియ స•మంచితరీతి గ్రహించి రామనా
మము స్మరియించుకొంచు సుర•మస్కరిమండలినుండి మ్రోల నిన్
గ్రమముగఁ గానిపించుకొనఁ•గా దరహాసముఁ జేయు నీశుఁడున్.

గీ. అదియయనుమతిగా నెంచి • యంచితముగ, రామనామప్రబంధకీ•ర్తనముఁ జేయు
మతఁడు నావలె సంతుష్టి • నానతిచ్చు, వరముఁ గోరు మటంచు నో•వరమునీంద్ర.

ఉ. అందుల కీవు డెందమున•యందలివాంఛ నివేదితంబుఁ జే
యందగు నందుపై ముదము • నందుచు నందిహయుం డనుపమా
నందము నీవు చెంద విధి•నందన! తారకమంత్రతత్త్వపుం
జందము నెల్లఁ దెల్పు నిటు•సల్పు మటంచును దద్విశేషముల్. ౯౩.

ఉ. ఇంతియ కాదు తన్నగర•కే వరుదెంచితి వన్నవార్త వి
న్నంతనె నిన్నుఁ గాంచు తెవు•డంచుఁ దలంచుచు దేవసేవలం
దెంతయు భక్తిఁ బ్రొక్కిలిడు • నెప్పుడు నప్పుర మేలు ధారణీ
కాంతుఁడు వానిదుర్గమున•కై చని యాతనిఁ బ్రీతుఁ జేయుమా. ౯౪

ఉ. ఆతఁడు నిన్నుఁ దారక•మహత్త్వముఁ దెల్పు మటంచు వేఁడినం
జేతము బ్రీతి నొంద శశి•శేఖరుఁ డేగతి నీకుఁ దెల్పె నా
రీతి సమస్తముం దెలిపి • తృప్తిని జేయఁ దగుం గులక్రమా
యాతముగాఁగఁ దన్నిరతి • నాతనిసంతతి వృద్ధిచెందఁగన్. ౯౫.

ఉ. ఆవిధి లబ్ధవాంఛితుఁడ•వై యుపమాకరు నేగు మంచు న
ద్దేవి యనుగ్రహించినని•దేశము చొప్పున నప్పు డొప్పుగా
దైవతమౌని వెల్వడి య•థాక్రమరీతి సమస్తతీర్థసం
సేవల నాచరించుకొని • చెచ్చెర నగ్గిరుడాద్రి కేగుచున్. ౯౬.

కం. వడి నడవిదారిఁ గొని కాల్నడఁ దా జడదారి యొకఁడ • నడచెడు నెడ నా
క్కెడఁ బ్రొద్దు గ్రుంకఁగా నక్కడ నారే యుండఁ గడఁగి • కడ లీక్షింపన్.

సీ. తహతహార్భటిఁ గాక•కంకగృధ్రోలూక,ములు గూండ్లదరిఁ జేయు•కలకలంబు
వఱడు మున్పసిపట్టి • వాసితం బొనరింపఁ, గడువడిఁ జేరు న•క్కలరుతంబుఁ

బొదసూపఁ దటియంచు ◆ బడిబడి నేతెంచు, నలఁతిభూతములుగొం ◆ డాడురొదయు
పడిగేటి భువిఁ బాఱ ◆ వైచినయస్థికై, కలహించి మొఱుగు కు ◆ క్కలరవంబుఁ

తే.గీ గలసి కర్ణకఠోరంబు ◆ గాఁగఁ దోఁప, బ్రహ్మరాక్షసచిరతరా ◆ వాస మగుచు
ననతిదూరంబునం దొక్క ◆ ఘనవిశాల, మైనయశ్వత్థ వృక్షంబు ◆ గాననయ్యె. ౯౯.

కం. ఆరావిచెట్టువంకకుఁ, జేరక నొకగున్నమావి ◆ చేరువఁ దోఁప
న్నారదమునివరుఁ డాసహ, కారము క్రింద నివసించెఁ ◆ గడు నెమ్మదిగాన్.

ఉ. అంతటఁ గన్నిశం భ్రభ్రమ ◆ యామమునం జలప్రశభూరుహ
ప్రాంతము నుండి, నన్ జెనక ◆ రాకుము రాకు మటంచు బిట్టుగా
నంతియెలుంగు దోఁప నిది ◆ యేమొకొ యంచు మునీంద్రుఁ డక్కుజో
పాంతముఁ జేర నేగి యర ◆ యంగ నొకండును గానరాని చోన్. ౧౦౦.

కం. ఇది యేమని యబ్బురపడి, మొదలిటి సహకారమూల ◆ మునకుం జనఁగాఁ
బదపడి యప్పటిచొప్పన, ముదితయెలుఁగు వినఁబడంగ ◆ ముని సత్వరుఁడై.

కం. అవ్వలనికిఁ జన నచ్చట, నెవ్వండును లేకయున్న ◆ నిది యే మనుచున్
నివ్వెరపడి విడిదికిఁ జనె, నివ్విధమున మూఁడు సారు ◆ లేగుచు రాఁగన్ ౧౦౨.

ఉ. సంధితమైన యంధతమ ◆ సంబున వండియుఁ గూయి దోఁప ది
గ్బంధ మొనర్ప నన్నెలవుఁ ◆ బాయ నుపాయము లేక మేన నే
సంధియునుం జెలింపఁ బిఁ ◆ శాచనిశాచరముఖ్యమైనక్ర
వ్యాంధసు లున్నచో నిలువ ◆ నచ్చటకేన్ ముని యేగి యుంగిటన్. ౧౦౩.

సీ. పవడపుఁగోళ్ల చం ◆ ప్పరపుమంచముమీఁద, హంసతూలికల శ ◆ య్యాతలమునఁ
గుదిటితోఁ దెమలించి ◆ కొని తెచ్చి యుంచిన, పూత సున్మఖమైన ◆ పూవుఁదీవ
పోలికఁ దముఁ బాసి ◆ పుడమి కేతెంచిన, మెఱుఁగారుక్రొ క్కారు ◆ మింముఁ గదసి
కదలకుండఁగఁ బట్టి ◆ కలిసిన మొయి లన, పెన్నెరుల్ మెయి నిండ ◆ విరిసియుండఁ

తే.గీ. జక్కఁదనమునఁ జొక్కపుఁ ◆ జుక్కవోని, దాని నక్కజమైనచం ◆ దమున నచటి
యునికిఁగలదాని నెలప్రాయ ◆ మునఁ దనర్చు, మించు సుకచిన్నదాని వీ ◆ క్షించియెదుట.

సీ. కోఁతివితో జగడించు • కఱకునల్లనిమేను, మిడిగ్రుడ్లు గడితంపు • మిట్టనుదురు
వెడఁదనోరును దట్ట • పెదవులు గొగ్గిళ్లు, పలుఁ బుఱ్ఱముక్కు • నిట్టలవుఁ జెవులు
గుఱువంపుఁజేతులు • గుంటలొమ్ము నదొట్టె, కడుపు నిడుపుఁగాళ్లుఁ • బొడుపు మెడయుఁ
బల్లవెంట్రుకలుఁ దో • ల్పచ్చడంబును నల్ల, పూఁతగందమ్మును • బుట్టతలయు

తే.గీ. నెమలికోలయుఁ బ్రేలుజం • దెమును బునుక,
చెంబుఁ గలవానిఁదిండికై • వెంబడించి
యాలఁతి బూచులు గొలువంగ • వలఁతి యగుచు,
గండఁడగు నొక్కబ్రహ్మరా • క్షసునిఁ గాంచి. ౧౦౬.

శా. ఓ హెబా! యీతనికృత్యమా యిది నిజం • బూహింపఁగా నేల తి
ద్వ్యాహారంబులచే బయల్పడుఁగదా • యంచుం గృపాయత్తుఁడై
యా హంసీగమనావతంసము భయ • వ్యామోహముల్ వాపి నీ
వాహాకార మొనర్ప నేటి కన న • య్యబ్జాక్షియుం డిగ్గునన్. ౧౦౭.

కం. మంచము డిగి పెన్నెఱుల స, మంచితముగఁ గ్రొమ్ముడిగ న • మర్చికొని సమా
కుంచితవిగ్రహయై ముని, పంచాస్యునిపాదయుగళిఁ • బట్టి వచించెన్. ౧౦౮.

ఉ. ఓమహితానుకంప! సమ • యోచితదివ్యతరప్రభావశా
లీ! మునివర్య! ఏనుక న • రేశ్వరుపట్టిని నన్నుఁ బట్టి పీం
క్రీడెమయి నీమహాటవిత • నిమ్మణిమంచముతోడఁ దెచ్చి రిం
కేమి భయంబు నీపదము • లేఁ గనుఁగొంటిని గంటి సౌఖ్యముల్. ౧౦౯.

చం. అనవుడు బాల! నీ వెవతె • వమ్మ? వసించెడుదేశ మెద్ది? యె
వ్వనిసుత? వివ్వనంబునకు • వంచన నిమ్మణిమంచమధ్యశా
యిని నిను బ్రుచ్చిలించుకొని • యీఖలు లంతిపురంబునుండి యే
యనువునఁ దెచ్చి రమ్మ? వనితా! వచియింపుము మాకు నంతయున్. ౧౧౦.

చం. అన విని నేను కన్యను మ • హామహుఁ డైనకళింగదేశపుం
జనపతిపుత్రికన్ మదను • జన్ముఁడు బాలుఁడు తండ్రి వైరితోఁ
బెనఁకువఁ బోరుచో నొకని • వేటున వేఱొకరుండు గావడం
డనువులు వాసి వీరవిహి • తం బగులోకముఁ జేరి రిర్వురుః . ౧౧౧.

కం. పిమ్మట మాపదవికి మా, యమ్మను రాజ్ఞిగ నమాత్యు ♦ లనుమతిఁ జేయన్
నెమ్మిగ నామెయు రాష్ట్రం, బుమ్మలికముఁ బారయకుంత ♦ నోముచు నుండెన్.

గీ. పిన్ననాఁడు తండ్రి ♦ నన్నంధ్రదేశనా, యకున కిచ్చువాఁడ ♦ ననుచు ముద్దు
లాడుచుండు నాతఁ ♦ డట్లైనఁ దల్లియు, నట్టిపూన్కిఁ దానుఁ ♦ బట్టియుండె.

కం. సచివౌఘము సజ్జనకుని, వచనంబులు వినుట నంధ్ర♦వసుధాధీశున్
సుచరిత్రునిగా నెఱుఁగుటఁ, బ్రచురంబుగఁ దలఁపు లతని♦పై నిడి యుండన్,

ఉ. నాజనయిత్రి వెంట నర♦ణంబుగ వచ్చినమంత్రియొక్కఁ డ
య్యాజిని గూలినట్టిసుభి♦యాతికుమారుని వంగదేశపుం
రాజవునంచు వాని కిడ♦రాదొకొ నీదు తనూజ నంచు నే
వ్యాజముచేతనైనఁ గొని♦యాడును వానిని నన్నొసంగఁగాన్. ౧౧౫.

గీ. విని విని యమాత్యులను ♦ బిల్వఁ బనిచి యొక్క
నాఁడు తత్తత్క్రియాలోచ♦నముల నెఱపి
యిష్టగోష్ఠీవశంబున ♦ నిదియుఁ దలఁప
వార లందఱు నొక్కటఁ ♦ బలికి రిట్లు. ౧౧౬.

చం. ఒదవెడు భీతి నీదు తనయుండతి♦బాలకుఁ డౌటవానిమే
మదయుఁ డటంచుఁ బాపభయ♦ మన్న దెఱుంగఁ డటంచు మాపయిన్
వదలనిమత్సరంబు గల♦వాఁ డనుచున్ వినుచుండు మట్టిదు
ర్మదుఁ డగువానిబాంధవము ♦ మానుటయే సుమి మాకు మన్ననల్. ౧౧౭.

కం. మాయేలిక యీబాలిక, యాయంధ్రనృపాలుదేవి ♦ యాఁగద యనుచున్
మాయందఱి ముందట వా, లాయముఁ బలుమాఱుఁ దన త♦లం పెఱిఁగించెన్.

కం. ఆతఁడు పుణ్యశ్లోకుఁడు, వీతాఘుఁడు రూపబలవి♦వేకాదులవి
ఖ్యాతుఁడుఁ గావున నాతని, కీతరుణి నొసంగ నిశ్చ♦యింపుము మఱియున్.

చం. బవరపుమాట యమ్మనుజ♦పాలునివీనుల సోఁకి నంతనే
జవనహయాధిరూఢుఁ డయి ♦ సైన్యసమేతముగాఁగ వ్రేల్మిడిం
బవనసమానవేగమునఁ ♦ బాపటగా మనపక్షమూని ప
చ్చి వినఁగరానిమాట విని ♦ చెచ్చెర నేగ స్వరాజధానికిన్. ౧౨౦.

క. కావున నాజనపాలున, కీవనిత నొసంగ నిశ్చ♦యింపుము నీవున్
మా విభుసితలఁపు నట్టిద, నావుడు వారలకు మజ్జ♦నని యిట్లనియెన్. ౧౨౧.

క. అనఘాత్ము లాగ మీతె, ల్పినచొప్పునఁ గాక యొండు♦విధమునఁ గావిం
తునె యని తద్బాంధవమున,కు నెదం మజ్జనని యియ్య♦కొనియున్న యొడన్.

గీ. నేఁటిమధ్యాహ్నమున వంగ♦నృపునిపట్టి, వంగదేశాధినాథుండు ♦ సంగరమునఁ
జీవసంయుక్తునిగఁ బట్టి♦చెఱను బెట్టె, ననుచు మంత్రుల శోకవార్త♦వినఁగ వచ్చె.

ఉ. దాన నొకింత సంతసిలు♦దానను గావున నిర్మలోదక
స్నాన మొనర్చి సౌధమున ♦ సంజకడ న్నెఱు లార్చుకొంచు మం
దానిలసేవ్యమాన నయి ♦ యల్లన మంచమునన్ వసింపఁగా
నే నిదురించితిం బిదప ♦ నిచ్చట మేల్కని కన్ను విచ్చితిన్. ౧౨౪.

కం ఆలో నీలోహాకృతి, యాలోకభయంకరాత్ముఁ ♦ డెదుటం దోఁపన్
నాలో నే నొందినవెఱ, పాలోకేశ్వరుఁ డెఱుంగు ♦ నంతట వీఁడున్. ౧౨౫.

గీ. నిన్ను మ్రింగువాఁడ ♦ నీమెడయం దున్న, పసిఁడిబిళ్ల ద్రెంచి♦ పాఱవైవ
కున్న నను మిగుల ♦ నుగ్రుఁడై జంకింప, నడలు చెంది బొబ్బ ♦ లిడితి మిగుల.

క. అర్చినకొలంది వీఁడును, బేర్చినయాగ్రహముతోడ ♦ వెస మంచముతోఁ
జేర్చి నొకకొండమఱుఁగున, కోర్చితిఁ దత్సంకటముల ♦ కోపుణ్యనిధీ. ౧౨౬.

గీ. చిన్ననాఁడు తండ్రి ♦ శ్రీవేంకటేశ్వర, ప్రతిమ వఱుత నంగ ♦ రక్ష గాఁగఁ
గట్టె దానిమహిమ♦గా నెంచికొండంత, ధృతిని మంచ మేను ♦ దిగక యుంటి.

మ. అనఁ గారుణ్యమునన్ మునీంద్రుఁడును బాలా! యింత జంకేల! నీ
జననిం గూర్చెదఁ జేర్చెదన్ వడి మన♦స్సంప్రార్థితుండైననా
థునితోడ న్నినుఁ గూడ నేఁడె యని య♦ద్దుష్టాత్ముపై దోషనా
శనకృత్పాదగయోదకంబు కలశ♦స్థం బల్లనం జల్లినన్. ౧౨౭.

క. వీతాఖిలపాతకుఁడై, యాతఁడు బైశాచక్రి♦యావిముఖుండై
యాతపసిపదములం బడి, యోతండ్రీ! ప్రోవుమనుచు♦నొగిఁ బ్రార్థింపన్. ౧౨౮.

శా. నీ వెవ్వండవు? నీకు నెప్పుగిది నీ♦నిర్భాగ్యరూపప్రచా
రావస్థాదులు గల్గె? నీయబల మె♦ట్లాకృష్టయై చిక్కె నీ

చేరి వీంద్రుడెల్ల నెవండ్రు దెల్పు మిఁక గణింతుఁ జనుగ్రానుకం
పావేళంబున వీంద్రుతో నిపుడె నిన్నన్నం బిశాచేంద్రుఁడుఁ. ౧౩౦.

గీ. పాండ్యదేశాధిపుని ప్రాడ్వివాకవంశభవుఁడనగు నొక్క శ్రోత్రియ బ్రాహ్మణుండఁ
బృథివి ధూర్జటిశర్మాఖ్య వెలయువాఁడ, నెల్లరకుఁ దల్లమగుజాడ నెసఁగువాఁడ.

సీ. బాల్యకాలమునందె స్వాధ్యాయమయ్యెను, జవిచూచినాఁడఁ శాస్త్రములొకింత
నాభిజాత్యము గల దంచు నిక్కుచునుందు, న ప్రమాణోక్తి కింతైన వెఱవఁ
గడువికత్థనతచే మిడిసిపడుచునుందు, నొరులపెంపునకుఁ జూపోవఁ జాల
బ్రహ్మజ్ఞుఁడ నటంచుఁ బగ్గెలు గొట్టుదు, నెఱుఁగనివిద్య నికృష్టమందు

తే.గీ. నొరుని వలన నాకు నుపకృతి యొందాఁక, నొనరుచుందు నంతదనుక మెచ్చి
యేఱుదాటి తెప్ప నేర్చినచందాన, వానిపేరు వినఁగ నైన నొల్ల. ౧౩౨.

కం. అనువర్తన గల యగముని, ఘనుఁడంచును గాక యున్న ఘను నధముఁ డటం
చును విభుసభ నభయుఁడనై, విననీ వినకుండనీ చెవింబడ నఱుతుఁ. ౧౩౩.

గీ. చేసినయఘంబు దాఁపక చెప్పికొనినఁ, బోవునందురు గానఁ దెల్పెదమునీంద్ర
యెన్నియగుణంబులున్నవో యన్నినాదు, సొమ్ముగా ద్రిమ్మరుదుఁ జుమ్ము రిమ్ముకొనుచు.

గీ. చిత్తమెపుడు ధనార్జనాయత్తమగుట, యాగభిక్షామిషంబున నచటికచటి
కేగఁగఁ దలంచి కొమరుండు నేనుగూడి, యుత్కలంబులఁ గంటిమూరూరుదిరిగి.

గీ. బ్రహ్మబంధునిఁ గేవల బ్రహ్మయనుచు, నుత్కలంబున జనులకు సత్కరించు
ప్రతినయుండుట నను బ్రహ్మమతిఁ దలంప, పలసినంతధనంబుఁ బట్టుబడసి నాఁడ.

కం. దాని నొకబండి నిడికొని, సూనుండును నేను శకటచోదకుఁడును దే
శానకును మరలి రా నిస్థానమున దినావసానసమయం బగుడుఁ. ౧౩౪.

సీ. ఆనాఁడె గౌతమీస్నానయాత్రార్థమై, నడచి యేతెంచుచు నలుగురైదు
గురు మమ్ముఁ గూడిరాఁ గొన్నిముచ్చటలందుఁ, బరిచయంబయ్యెనప్పరుసవారు
కర్మఠుండని నన్ను గారవంబునఁ జూడఁ, గోరియద్దటి నొక్క గుంటజలము
లుంటఁ గన్గొని యేగుచుండుఁడు మాకుఁట్ల, వాఁడు మీరును సంధ్య వార్చివత్తు

తే.గీ. వనుచు వెనుక మొగంబైతి నరిగె బండి, కొంచెమైనను దడవుగావించి చనఁగ
వలదె యనిడొంక చాటున నిలిచియుండ, వచ్చెనాకస్మికంబుగ వ్యాఘ్ర మొకటి.

క. అటపై నా కొదవిన యము,చ్చటఁ దల్పఁగ నేల నిప్పిశాచర దానం
ఘటియిల్లై గావించె ట్ట,ప్పటినుండియు నిదియె నాకు • వసతిగ నమరెన్. ౧౩౮

క. ఈయున్న పిశాచంబులు, నాయ ట్లపవ్వలి మొగంబు•నం బడి యుండై
నాయంతటి వవి గామి,న్నాయకునిగఁ దలఁచి యెపుడు•నను సేవించున్. ౧౩౯.

క. పిమ్మట సుతుఁ డేమయ్యెనొ, యిమ్మెయిఁ గూర్చినధనంబు•లేమయ్యెనొ యం
చుమ్మలిక మందుచుంటిని, జుమ్మీ యని బ్రహ్మరాక్షసుండన మునియున్. ౧౪౦.

క. చింతింపకు మొక్కింతయు, నంతయు నేనింటిఁ జూమి త్వందాత్మభవుని వృ
త్తాంతముఁ బీతపురి న్నీ,సంతతికిం బాండ్యమధుర • సౌఖ్యము సుమ్మీ. ౧౪౧.

మ. పులివాతం బడి నీవు రాకునికి నీ•పుత్రుండు దత్సార్థముం
బలుచందంబులఁ జింతచే బొగులఁ ద•త్ప్రాంతస్థమౌ పల్లియం
గల గోపాలురు వారి దాసి యొక వ్యా•ఘ్రుం బిచ్చటం జేరి పాం
థులఁ బెక్కండ్ర దను బట్టి క్రిందొ నినం • దోధూయమానాంగులై. ౧౪౨.

క. గొల్లలు మాపల్లెకు రం,డెల్లి గన వ్యచ్చు మామ•హీపతి యీరే
యెల్ల మృగంబుల వేఁటం, బల్లార్చివధింప నిచటు • వసియించె ననన్. ౧౪౩.

క. వల్లే యని వారందఱు, నుల్లంబుల సొల్లఁబోయి•యుండఁగ నా రే
యెల్ల మెకంబులఁ బొరిగొని, యల్లన తద్దేశపతి సు•మాగతుఁ డయ్యెన్. ౧౪౪.

గీ. వచ్చి యవ్వార్త యచ్చటి•వారు దెలుపఁ, దాను గూర్చినపులిపాదు•దాపునందుఁ
గ్రొత్తనెత్తుటఁ దడిసిన•యుత్తరీయ, మందుఁ గల పేరివర్ణంబు• లరయఁ జేసి.

క. దైవగతిఁ గలుగు నాపద, లోవిప్రకుమార! చింత•నొందకు మొదలో
నీవిత్తంబును నిను మీ, యావాసపుటూరఁ జేర్తు•నయ్య యటంచున్. ౧౪౫.

గీ. తగిన సాహాయ్యమును గూర్చి • తద్గ్రహంబుఁ
జేర్చి యేఁటేఁటఁ గొంతవా•ర్షిక మొసంగు
చుండునఁట నాఁటి యమ్మహీం•ద్రుండు నేఁటి
కిని దదన్వయయుగ మట్టు • లెనయు మైత్రి. ౧౪౬

క. అని యచటి పౌరవృద్ధులు, ననుఁ గూర్చి తదీశకుల గుణస్తుతి గావిం
చు నెడం దెల్పినచరితం,బును నీవల్కినచరిత్ర•మును సరి గూడెన్. ౧౪౭.

గీ. పద్గరోదకబిందుసం•పర్కమునను, దుష్టభావంబు మాత్రంబు • దొలఁగెఁ గాని
విడిచిపోదయ్యెనుపిశాచ•వృత్తి గాన, దానిఁ బెడఁబాయుచందమం•దఱు వినుండు.

సీ. మీపిశాచత్వంబుఁ • బాపుదు గొంద ఱీ, మ్మంచంబుతోడ ని•మ్మించుఁబోఁడి
నీయంధ్రదేశంబు • నేలు శ్రీపీఠికా, పురనాథుసౌధాగ్ర•మునను డించి
యతని మేల్కొలిపి యా•యతివృత్తాంతంబు, నంతయు నెఱిఁగించి•యరుగు డంచు
నంతలోఁ గొంద ఱ•య్యంతి నంతిపురంబు, నందుఁ గానక చింత•నడలుచున్న

తే.గీ. యీమెతల్లికి నివ్వార్త•లెల్లఁ దెలియు, నట్టులాకాశభారతి • యనుకొనంగ
నొరులెవరు మిమ్ముఁ గనకుండ•నుగ్గడించి, రావలయు నంత దనుక ని•ందే వసింతు.

కం. అని ముని చెప్పిన చొప్పునఁ, బనివిని యప్పని యొనర్చి • పడి వెల్వడి వ
చ్చిన నందఱు నుపమాకరుఁ, జనుదెండని వెంటఁగొని వె•సం జని ప్రేమలన్.

చం. గిరిఁ దిలకించునంతఁ బుల•కించెను వానికి మేను దగ్గఱం
గరమెదలోన సమ్మదము • గ్రమ్మె గుడిం బొడఁగాంచి నంత నే
పరవశ మయ్యె మానసము • భక్తులు భాగవతైకసేవ చేఁ
బరవశు లౌదు రన్న భగ•వత్పరిచర్యకుఁ జెప్ప నేటికిన్. ౧౫౭.

కం. అటు లగ్గిరితటిదగ్గఱి, జటి యద్దరివాండ్ర నిలిపి • సాఁగి శిరమునన్
ఘటితాంజలిపుటుఁడై యొ,క్కట నక్కటకమున కేఁగి • కౌతూహలియై.

కం. పురికిన్ వలగొనియాదట, గిరికిఁ బ్రదక్షిణము దిరిగి • కృతబంధురపు
ష్కరిణీమజ్జనుఁడై యం, తరహీనమజ్జనులఁ గ్రందు•నన్ మందగతిన్. ౧౫౮.

కం. చనుచుండు నప్పు డాగుం, పుననుండి కనంగ నయ్యె • ముని కనుఁగవకున్
మనసు కరఁగింపఁజాలిన, ఘనమగుజాలి నొదవింపఁ • గల జన మెదుటన్.

సీ. అస్ఫుటస్వరముగా • నటు నిటుఁ గరసంజ్ఞ, గల తలంపేమేమొ • తెలిపికొనుచుఁ
దమప్రశ్నములకును•త్తర మొసంగిన వేళ, వాక్యాగా నెద్దియో•పలికికొనుచుఁ
బురి గిరి పిఱిఁది గాఁ•దిరిగి బయల్ గాంచి, ప్రోవవే హరియంచు•మ్రొక్కికొంచుఁ
గొండదండకు మమ్ముఁ • గొంపోర నడయాడ, నేర మటం చూఁతఁ•గోరికొనుచ

తే.గీ. మూకబధిరాంధపంగుల•మూఁక లెదుట, నున్నఁ గనుఁగొనియియ్యావజ•మున్నరుజా
కెన్నఁడొ వరించునో కృప•కెన్న పెన్నఁ, డనుచుఁదలపోసెనతఁడప్పు•డనుచుజాలి

క. కొండదరి కరిగి వారలఁ, గొండొకతడ వూరడించి ♦ గోవింద హరి
యండజరాజహరీ యని, మెండుగఁ జేర్కొనుచు మొదటి ♦ మెట్టెక్కె దతిన్.

సీ. గొంతెత్తి గోవింద ♦ గోవింద యని సంత, రువ్వగా బిట్టువా ♦ క్రుచ్చువారు
శ్రుతిమాలె మారుతా ♦ హతి వీణెసారణి, ననువుగా సవరించు ♦ మనెడువారు
ద్వారగోపురదృష ♦ ద్వారశాసనపర్ణ, సమితి విస్ఫుటముగాఁ ♦ జదువువారు
వడివడి ముందుకై ♦ నడచి శ్రమ్మతి తన, యడుగులఁ బడి మ్రొక్కు ♦ లిడెడువారు
తే.గీ. నైన వారలఁ దన వెంట ♦ నరుగుదెంచు, వారి నలమూకబధిరాంధ ♦ పంగుజనులఁ
జూచుచుఁ గపటనాటక ♦ సూత్రధారు, చిత్రనాటకపటిమ క ♦ చ్చెరువు చెంద

క. అక్కరణి నొక్కచో నదు, చక్కం జెంపెక్కు పెక్కు ♦ జక్కరలు దరుల్
జక్కఁగఁ జూచుచు నక్కడఁ, జుక్కలు చేఁజిక్కునన్న ♦ చో నెక్కెయెదన్.

క. సాలగ్రామశిలాఫల, కాలేఖ్యాకారదర్శి ♦ తాత్మునిఁ దులసీ
సాలగ్రామనుహోన్నత, సాలగ్రామణ్యగార ♦ సంస్థాయిఁ గనెన్. ౧౨౦

క. కనుఁగొని సాష్టాంగముగా, వినతులు గావించి లేచి ♦ వినమితతనుఁడై
వినయం బెనయఁగ నమ్ముని, వినతాసుతశైలనిలయు ♦ వినుతించె నిటుల్.

క. కారుణ్యశరణ్య! నిరా, కారము సాకారముగ స ♦ కలభువనచయా
కారము నగుభవదీయా, కారముఁ ద్రివిధంబుగాఁగ ♦ గణుతించు శ్రుతుల్.

గీ. బ్రహ్మనిర్గోచరంబందుఁ ♦ బ్రాథమికము, దెలిసికొందురుబుధులు తా ♦ ర్తీయమూర్తి
భక్తులకు రెండవది దోఁచు ♦ భావనాను, రూప మగురూపముగ ధీని ♦ రూపణీయ.

క. పంచాయుధీసమంచిత, మంచుఁ జతుఃపంచశాఖ ♦ మంచున్ మించున్
మించుజిగిమించి సాల్పుల, దంచున్ వించుందు నీయొ ♦ యారమును హరీ. ౧౨౪

క. భయ మేది నుడివెద జగ, త్ప్రియ మే దినదిన మొనర్చు ♦ మృదుపదకమల
ద్వయ మేదిని మును నగరా, న్వయ మేదినతోయ మేది ♦ నరహరి చెపుమా.

సీ. పొక్కిటఁ బొందమ్మి ♦ పువుఁ జూప వేమి యు, రంబునఁ గౌస్తుభ ♦ రత్న మేది
వనమాలఁ గంఠంబు ♦ నను జూప వేమి నీ, వక్షంబు కెలన శ్రీ ♦ వత్స మేది
తపనీయమకుట మ ♦ దలఁ జూప వేమి క, ర్ణములందు మకరకుం ♦ డలము లేవి
పదములం దైన హం ♦ సముఁ జూపవేమి సత్కారుణ్యకటాక్షవీ ♦ క్షణము లేవి

తే.గీ. యిరుగెలంకుల వీచోపు • లిడుచుఁ జెలిమిఁ, దోఁపఁ దీపించు నిల నీలఁ • జూపవేమి
యన్నిటికి నేమి సామి కాం • హాంతరాళ, దివ్యమందిరయిందిరా • దేవి యేది! ౧౬౬.

కం. మృగయాఖేలనలీలన్, మృగయులు ప్రేరేప నడవిఁ • ద్రిమ్మరఁ జని యా
మృగములఁ దునుమాడుచు నో, మృగధరభావుక! వసించి • తే యందుఁ దమిన్.

కం. నీవిందారయఁబడవిది, గోవిందాఁకలియడంగఁ • గొమ్మనియొవఁడో
నీవిందావలఁబిలువఁగ, గోవిందాయేగి యచటఁ • గూర్చుండితివో ౧౬౮.

మ. అని యేవం విధమైనరీతి మదిలో • ధ్యానించి ప్రార్థించుచోఁ
గన నయ్యెన్ మునికిన్ ముకుందుఁ డెదుటం • గంజాతముం గౌస్తుభం
బును దోమాలెయు లాంఛనంబు మకుటం • బుం గుండలంబుల్ స్మితం
బు నపాంగంబులు ధాత్రినీశరమయుం • బొల్పొంద బల్పొందు గాన్. ౧౬౯.

కం. హరి యెదుట నిటుల సాక్షా, త్కరించిన విరించనసుతుఁడు • గడు వేడుక నీ
చరణములే శరణము లని, పరువడిఁ బరమప్రపత్తిఁ • బ్రణతుం డయ్యెన్. ౧౭౦.

కం. మించిన ప్రపత్తి మదిఁ బ్రస, రించిన మస్కరినమస్క • రించిన నంకూ
రించినకృప శ్రీహరి పరి, కించి నతునివినతు లాల • కించినవాఁడై. ౧౭౧.

కం. ఆరెండు పనులకై యిరు, సారులు మును విడువవలసె • సదనము మాకున్
నారద మూఁడవ పరి నీ, కారణమున మరల నేఁడు • కదలఁగ వలసెన్. ౧౭౨

కం. నావుడు మునిపుంగవుఁ డో, దేవా! మొదలింటిరెంటి • తెఱఁగు లటుండం
గా వినఁగ వలసె వెడలుట, నావలనం గలిగె నేఁడ • నం గతము నవన్. ౧౭౩.

కం. మున్నింటిరెంటి తెఱఁగులె, మున్నుగ వినవలయు వరుస • మూఁడవయది నీ
పన్నినవన్నాహమె నీ, కన్నరవ మీఁద నున్న • యపమప్రేమన్. ౧౭౪.

గీ. అనిన ముని నతోత్త • మాంగుఁడై యిట్లను, నొక్కదాని కంటె • నొకటి వింత
యగుచుఁ దోఁచుచున్న • దడిగిన నిఁక నేమి, వచ్చునో వచింపుఁ • డిచ్చకాలఁది.

మ. అనినన్ నవ్వుచు నవ్విభుం డను మునీం • ద్రా! వింత లే డింకయున్
మనమం దీవు తలంగినట్టిదియ హైం • నం దెల్పెదం బొల్పుగా
వినుమీ వేఁట లొనర్పఁగా నటేగియుం • విందన్న విచ్చేసియున్
మును నే ముంటిమి స్వల్పకాదినము లిం • పొంతం గరం బొంటిగాన్. ౧౭౬.

సీ. శేషాద్రి మేము వసించియుండఁగ మునుల్, గొందఱు మముఁ గూర్చి ఘోరతపము
సేయఁగాఁ బ్రత్యక్షమై యభీష్టం బేమి యన వారు మోక్షంబు నభిలషింప
నది తపోధ్వరజపస్వాధ్యాయముఖసత్క్రియాకలాపంబులఁ బ్రాప్త మగునె
నాచేతహేతులకు జ్ఞానసంగతులకుఁ, గాని కైవల్యంబు గలుగ దెందు
తే. గీ. నాగనాగాశనాగవనాగములను, గము లమర మన ముగ్గమ్యగములమగుచు
సాధులను బాధఁ గావింపసాధులగుచు, వారు మొఱలిడఁగ నపరివారుఁడగుచు.

చం. గరుడుని మీఁదఁ గూర్చి యధికం బగుటం దదహార్యసీమ మం
దిరముగ నున్న యాహరియె నిక్కముగా మన వాంఛఁ దీర్చునం
చరిగిరి సాహసైకపరులాత్మసముద్యమసిద్ధిమాత్రత
త్పరమతి నంద్రుగాని యిది తప్పిది యొప్పని కర్జ మెంతురే. ౧౬౮.

కం. తలఁచుకొనినంతపని వారలు సేసిరి దాని కేను బ్రతివిధిఁ జేయన్
వలసె నవి యెవ్వియైనను, ఫలియింపకయుండునే తపస్వులవాంఛల్. ౧౬౯.

కం. ఈవని మొదటిది దీనికి. చాపనిషంగాసిముఖ్యసన్నాహముతో
మాపని రేపని చూడక, యేపని కేగి నలు లొప్ప నేగఁగ వలసెన్. ౧౭౦.

చం. వలలును మాట్లు దీమములుఁ బాదులు జోపులు వేఁపులున్ మొదల్
గలతగుసాధనంబు లెసఁగ న్నలపోటరి వేఁటకాండ్రు రా
వలదని నిల్పఁగా వలసె వాని కవే యెదు రేగుదెంచి ని
శ్చలముగ లక్ష్యసీమ వరుసం గుహనామృగము ల్వసింపుటన్. ౧౭౧.

గీ. అప్పు డొకపరి నాలైదహర్నిశమ్ముఁ
లుండవలసెను మాయుండుకొండ విడిచి
మఱియు నొకపరి వెడలుచు మరలుచుండ
వలసెఁ గొన్నాళ్లు దాని నేర్పడఁగ వినుము. ౧౭౨.

చం. కలఁ డొకగొల్లఁ డిద్దరి నొకానొకపల్లియ నందగోపన
త్కులజుఁడు వాఁడు పుట్టినదిగోలె నెకప్పుడు నూరు నిల్లునుం
దెలియనివాఁడునా నడవిఁ ద్రిమ్మరుచుం బసి తోడు వాఁడుగా
మెలఁగుచునుండు నప్పసులమీఁదుల నీ పులకింప నెప్పుడున్. ౧౯౧.

కం. అటులుండఁగ వానికి గో, పటలీసేవైక పుణ్య ♦ పరిపాకమునన్
ఘటియిల్లెఁ దెలివి మది వి, స్ఫుటతరముగ నిట్టులొకటఁ ♦ జోద్యము గాఁగన్.

సీ. అడవిమ్రాఁకులఁ గాంచి ♦ పుడమి నెవ్వఁడు నాటె, వీని నెల్లనటంచు ♦ విస్మయపడు
సెలయేళ్లఁ దిలకించి ♦ యిల వీని నెవ్వండు, ద్రవ్వించె ననుచు విం ♦ తవహియించు
భూధరంబులఁ జూచి ♦ ప్రోవు వెట్టె నెవఁడీ, రాతిగుట్ట లటంచు ♦ భ్రాంతిఁ జెందు
మెకములఁ గని వీని ♦ మేపు నీర్వట్టు నె, వ్వఁడు గాంచు నంచున ♦ బ్రమువహించు
తే.గీ. గొప్పదొరయొక్కఁ డెవ్వఁడో ♦ తప్పకుండ, నిట్లు గావింపుచునియాన ♦ తిచ్చియుండ
వచ్చు లెంకల కాబంటు ♦ బలఁగమైనఁ, గానరాదయ్యెఁ జిత్రమి ♦ కాననలోన.

చం. అని మఱియుం దలంచు నిటు ♦ లార ననుం గనె నాదు తండ్రి యా
తనిఁ గనె వాని తండ్రి యిటు ♦ తండ్రుల తండ్రుల నెన్న మున్నుగా
జననము నొందియుండవలెఁ ♦ జక్కఁగ నొక్కఁడు వాఁ డెవండొకో
యని తెలియందగుం దెలుపు ♦ నాతనిఁ దొల్త నెఱుంగఁ గానగున్. ౧౫౬.

కం. అనుకొనుచుఁ గంటి కెయ్యది, గనిపించిన దాని కెల్లఁ ♦ గారణ మొకఁడుం
డును దానిఁ దెలుపు నెవఁడో, యనుకొనుచుండఁగ నొకయ ♦ హర్ముఖవేళన్.

కం. వాని కొకవిప్రుఁ డెదుటం, గానంబడెఁ గేయిఁ ద్రోవఁ ♦ గానక కానన్
దా నొక్కెడ నిలచి యుష, స్స్నానమునకు జలము లుండు ♦ చక్కి నెమకుచున్.

శా. ఆవిప్రుం గని డాయఁగా నరిగి య ♦ య్యా! యియ్యరణ్యంబునం
దీవొక్కండవు సంచరింపఁగఁ గతం ♦ బే మంచుఁ బల్కంగ నీ
శ్రీవన్ గారుడపర్వతంబు గల దం ♦ ద్రిగ్ర్యగ్రభాగంబునం
దేవుండుండుఁ గదా తదంఘ్రియుగ మం ♦ ర్థిం గొల్వఁగా నేఁచుచున్. ౧౫౯.

ఉ. ఏనొకరుండ నిన్న నట ♦ కేగుచునుండఁగ సంజప్రొద్దునన్
వానమొయిల్ పడిం గవియ ♦ బై నిరు లేచఁగ దారిదప్పి యి
క్కాన నిశన్ వసించితి ని ♦ కానొక యూరమునందు వేకువన్
స్నానజలంబు లిం దరయ ♦ నా కగపించితి వీవు నాపుడున్. ౧౬౦.

కం. అయ్యా! నాపున్నియమే, మయ్యా యియ్యెడకు మీర ♦ లరుదెంచుటచే
నియ్యెడ దొడ్డది యయ్యెఁ గ, దయ్యా యియ్యడవి మీరఁ ♦ బడుగిడుకతనన్.

కం. ఒదవె న్నినుఁ గాంచుట నాఁ,డఁ దలంచినతీర్థము లెదు•టను దోఁచినటుల్
వెదుకం బోయినతీవియ, పదముల దవిలి నటు లిపుడు•పావనమూర్తీ. ౧౯౨.

కం. పులుఁగులరాయనికొండం, గలఁ డొకదేవుండు వానిఁ• గనఁగాఁ జనఁగా
వలె నంటి వతఁడు బాపఁడొ, పొలుపగునొరకొడుకొ గొల్ల•బోయఁడొ చెపుమా.

మ. అనినన్ మువ్వురు గాఁడు మువ్వురుగ న•య్యావేళలం దోఁచె న
య్యనఘుం డందఱి కంటె నాథుఁడు జగం•బాతండె కల్పించె నా
తనికిం జేయఁగరాని యొక్కటియు నీ•ధాత్రీ తలంబందు లే
దనినం గ్రక్కునఁ దత్పదంబులకు సా•ష్టాంగంబుగా మ్రొక్కుచున్. ౧౯౪.

శా. ఎవ్వా రైనను దెల్పఁగాఁ దగినవా• రే తెంతురో యంచు నే
నువ్విళ్లూరుచునున్న దన్న నిదియే • యొక్కండె కల్పించినాఁ
డెవ్వాఁడో జగ మెల్ల నంచు మదిలో • నే నెంచుకొంచున్న య
ట్టివ్వేళన్ వచియించినాఁడవు గదే • యీ వానుడుల్ నిక్కముల్. ౧౯౫.

కం. అందఱికంటె నతండే, ముందు పొడమి యుంటఁ జేసి• మొదలిటివాఁ డౌ
చుం దవరు నట్లు నాతల,పుం దోఁచెడి నతని కంటెఁ • బూర్వుఁడు లేమిన్.

కం. నీమాటకుఁ దార్కాణగ, నామదిలోఁ దోఁచె నతఁడు• నా యడిగినయ
ట్లామువ్వురు గాఁడని మఱి,యామువ్వురు నగుదు రంటి• వది యెట్లొక్కొ. ౧౯౬.

చం. అన విని బ్రాహ్మణుం డనియె •నాతఁడు బాపఁడు గాఁడు రాజనం
దనుఁ డనరాదు గొల్లఁ డనఁ• దప్పగు నాతఁడు మూఁడుజాతులన్
జననము నొందె రాముఁ డనఁ•బంజ్ఞల మున్ ప్రజఁ గొన్నివేళలన్
ఘనమతిఁ గ్రోవ నట్లగుటఁ• గాఁడని యానని తెల్పఁగాఁ దగున్. ౧౯౭.

కవిరాజవిరాజితము.—అనినముదంబున•నాతఁడువొంగుచు•నయ్య వినందగు•నాతని వ
ర్తనములు రాముఁడ•రణ్యమునందు వి•రాధునిఁ గూలిచి•రావణుఁ జం
పిన ఘనుఁడే కద•పీనికతల్ మును •వీనులవిందుగ• వేమఱు విం
టినిజామియాతఁడు•నిక్కము దేవుఁడు•నీనుడులట్లనె•నిక్కవముల్.

కం. కొయ్యలకునుగోఁతికిఁదొలు, దయ్యమునకుదొరతనంబు • దయనొనఁగెఁగదా
నెయ్యమున నతనిఁ గొలిచిన, నెయ్యది సమకూరకుండు•నెవ్వరి కైనన్. ౨౦౦.

క౦. ఆయయ్య రాచకొమరుం, డాయన నని గెలుకలేక • యరిగెను శాపం
డీయిరువురుఁ దగుదురు మఱి, నాయింట నొకండు పొడమి • నాఁ దట గాదే.

క౦. నీవంటి యెఱుకగలవా, రీవిశ్వమునందుఁ గలరె • యెచ్చోనైనం
గావున దేవునిఁ దెలియం,గావలె నతని నెటు గానఁ • గాఁ దగుఁ జెపుమా.

గీ. ఎచట నుండుదేవుఁ • డేతీరుగా నుండు, నేమటంచుఁ బిలువ • నేగుదెంచు
నేవి యారగించు • నెంతద వ్వాతని, యెల్ల యెల్ల నాకు • నెఱుఁగఁజెపుమ. ౨౦౩.

క౦. అని మూఢభక్తి వేఁడిన, విని విప్రుఁడు వానిభక్తి • విశ్వాసాదుల్
తనకుఁ ముదమిడఁగా నా, తనిదయఁ దరియింపఁ జేయు • తలఁపునఁ బలికెన్.

చ౦. పరమపదంబు వానికి ని • వాసము నల్లని మబ్బుగెబ్బు నం
గరుచిగలాఁడు స్వామి! మముఁ • గావ మనం బలరెంచు నెద్దియె
వ్వరి కిల నోగిరం బదియె • వానికి నింపగు నెంతదవ్వు కు
య్యరయ వినంగ నానొ యతఁ • డంతటి దవ్వున నుండు నంతటన్. ౨౦౪.

శా. నీవా దేవునిఁ జూడఁ గోరితివ యే • నిం దెల్పెదం సర్వవాం
ఛావాప్తిన్ ఘటియించు దాని నొకది • వ్యంబైనమంత్రోత్తమం
బావర్తించుచునుండు మొక్కనెల ని • త్యంబుం గడుం బూని కొం
పైవర్తిల్లఁగ వేయిసారు లటపైఁ • బ్రార్థింపు మీచొప్పునన్. ౨౦౫

క౦. నల్లని మేన్గలసామీ, తెల్లనిమోరగలపక్కి • తేజిపయిన్ నీ
వల్లన యరుదెంచి కృపం, జల్లనిపాల్కడయును • చవిఁగొని చనుమీ. ౨౦౬.

క౦. అని వేఁడుకొనిన దేవుఁడు, కనికరమున నీవసించు • కడ కేతెంచున్
దినదిన మిటుచేసిన దర్శన మిచ్చుం జనువు లిచ్చు • రమ్మన వచ్చున్. ౨౦౭.

క౦. అని తెలిపిన నమ్మంత్రము, ననుగ్రహింపవలెననియు • నాపై మఱియున్
దనబందుగుఁ కుఁ గూడం, గనుపట్టెడు వెరవుఁ జూపఁ • గావలె ననియున్. ౨౦౮.

క౦. ఒనరఁగ విప్రుని పదయుగ, మున దనమూర్ధంబు సోఁక • మ్రొక్కిన నతఁ డొ
య్యన లేవనెత్తి యొక ఝరమున స్నాతునిఁ జేసి దాను • మున్నుగ వానిన్.

క౦. పిమ్మటఁ దారక మనుశ్రే, ద మ్మగుచతురక్షరిన్ య • థావిధి నుపదే
శమ్మొనరఁజేసి యిమ్మం, త్రమ్మెనుఱకుండు మనుచుఁ • గ్రమ్మఱఁ బలికెన్. ౨౧౦.

ఉ. అల్లదె నల్లనై పొడవునై మన మిప్పుడు చెప్పుకొన్న శ్రీ
వల్లభుఁ డిల్లుగాఁగ నిలువం జెలువం బుగమించునీద భూ
తల్లజకొండదాని కొకదండనె సంగు సరోవరంబు సం
ఫుల్లపయోజహల్లకసముల్లసితంబయి బంధురాఖ్యచేన్. ౨౧౧.

కం. నీవారి దాని వారిన్, నేనేగం దానమాడ నియమింపుము నీ
వావేళ నీవాసఁగుపా, ల్ద్రావఁగఁ జనుదెంచి మీకు దర్శన మిచ్చున్. ౨౧౨.

కం. అప్పగిదిఁ జెప్పి విప్రుం, డప్పుడె తన దారిపట్టి యరిగిన నాతం
డొప్పగ నుపదేశోక్తుల, జొప్పున మంత్రము జపించి శుద్ధాత్ముఁడై. ౨౧౩.

గీ. కాఁచిచల్లార్చిపాలుమీఁగడనమర్చి, బిగ్గరగఁ జేర్చిననుఁగూర్చి పిలువఁదొడఁగ
నల్లనగుసామిచిల్వబోన పుహుమాయి, నెక్కిరావయ్యయివుడునా చక్కికనుచు.

మ. త్వరతో నన్నుఁ బ్రసన్నుఁడై దరికి నాహ్వానంబు గావింప నే
డ్కి రహింపం దరియం గృతప్రణాముఁడనాటం జేసి తద్ధ్యానమై
ఖరిఁ బక్షీంద్రహయుండనై యచట సాక్షాత్కారముం జేయఁగా
నరుగంగా వలసెం జుమీ యపుడ భక్తాధీనతం దెల్పుచున్. ౨౧౪.

కం. ఆనాఁ డటు నేనరుగఁగ, నానాఁటికి నతఁడు నెమ్మినమ్మికయుఁ దగం
గా నటు పిల్వఁ దొడంగుట, నేనేగుట నాకు నిత్యకృత్యం బయ్యెన్. ౨౧౫.

గీ. అటులు కొన్నాళ్లు గడపి యంతట నతండు, బంధుగులకెల్ల నిప్పని బయలుపఱప
వార లబ్బురపడి మస్తువారుఁ గూడఁ, జూడఁ గోరినఁ గొలననీ గాడఁ జేయు.

ఉ. వారికి నెల్లదర్శన మవారితలీల నొసంగి యీతఁడీ
తీరునఁ జేయుచుండఁ బని తీరదె మాకని వానిఁ బిల్చి యా
ధీర!హితంబు గాదు మన భీరహితాత్మత నన్ను నెప్డు మా
చేరువ నుండఁ గోర మముఁ జేరు వరం బిడి నారమర్త్యులన్. ౨౧౬.

గీ. అతఁడు చతురక్షరీజపవ్రతనిరూఢ, బుద్ధిఫలసిద్ధిఁ బడసిన యద్ధరిత్రిఁ
జెందె నిల సర్వసిద్ధిప్రసిద్ధి బంధు, రంజకసరస్సునకు బంధుర మను పేరు.

కం. తొలుత నొకకొన్నిప్రొద్దుల, కొలఁదిగ నొకకొన్నియేండ్ల కొలఁదిగ నేఁడుం
దలఁగిరి మిటుపైఁ దలఁగన్, వలయుం గద వేల కొలఁది వర్షంబులుగాన్. ౨౨౦.

ఉ. నావుడు నన్నుఁ గూర్చి పద♦నంబును మూఁడవసారి చెల్వడం
గావలె నంటి రీ రిపుడు♦ గావున నట్లన నేమి కారణం
బో వినఁగన్న సందియము♦ వోవునె నాదు మనంబు తొట్రుపా
టావహిలం దలంకెఁ జెపు♦మా కృప నాయపరాధమున్ హరీ. ౨౨౧.

కం. అనవుడు నీ వపరాధం, బనుకొని యొనరింపకున్న♦ నది యపరాధం
బును గాక యున్న యయ్యెన్, మునివర మాచలనమునకు♦ మూల మెటన్నన్.

ఉ. కుక్కుటలింగమూర్తి గడుఁ♦గూరిమిఁ జెప్పిన తారకక్రమం
బక్కడి రాజశేఖరున♦ కంతయుఁ జెల్లముఁ జేసి పచ్చితీ
విక్కడి కాతఁ డంత జపి♦యించెను దన్మహిమం బెఱుంగనం
దొక్కవిధంబుఁ బూని విధి♦యుక్తిగ నెక్కదినంబె పేర్మితోన్. ౨౨౩.

కం. తావన్మాత్రజపంబున, నే వానికి వరము లొసఁగ♦ నేగి తదీయం
బౌ వాంఛ యేమి యని సం, భావింపఁగవలసెఁ దత్ప్ర♦భావము వలనన్.

సీ. అతఁ డా జపమున♦కై దీక్షఁ బూని సం,కల్పించు నపుడు సాం♦గపరివార
ముగ మమ్ముఁ బ్రత్యక్ష♦ మగుఁడటంచుఁ దలంప, నచ్చటి కప్పుడె♦ యరుగుచుండ
నంతఁ బ్రదోషనా♦ట్యావసరంబునఁ, గుక్కుటేశ్వరు కొల్వుఁ♦ గోరి వేడ్క
గుంపులై వచ్చు♦ నిలింపు లంతంతనె, మమ్మంతరిక్షమా♦ర్గమ్మునందుఁ

తే.గీ. గాంచి యెదురేగు దెంచి స♦మంచితముగ, నక్కడకు మమ్ముఁ గూడఁగ♦మ్మనుచు వేఁడ
నింత కన్నను మే లున్న♦దే యటంచుఁ, జెలఁగి మే మందఱముఁ బ్రవే♦శించునపుడు.

ఉ. మాపటివిఘ్నరూపమును♦ మాన కొగిం బవళింపఁ జేయనో
తేపకుఁ దేపకుం బ్రబలు♦ తేజపు వేఁడిమి మగ్నమూర్తియై
పాపికొనంగనో గగన♦వర్తపరిభ్రమణప్రభూతసం
తాపము దీఱ మజ్జన మొ♦నర్పను భానుఁడు ప్రాలె వార్ధికై. ౨౨౬.

గీ. కాలసభికాగ్రగణ్యుండు♦ కాలగళుని, నటనపటిమావలోకనా♦నంతరమునఁ
బారితోషిక మిడఁగ నం♦బరము గొసను, బసుపానంగించె నవసంజ♦ పసఁ బొసంగ

కం. జగ మంధకారితను జెం, దెఁ గదా యని తోడుతోన♦ దీపకలాపం
బాగిఁ దోఁచెను ఘసితద్యుతి, యుఁ గడుం జొప్పడియె నప్పు♦డొప్పుగఁ జూడన్.

గీ. అంతట నిశాసుధాకర♦వ్యతికరమునఁ
గడలుకొనుచు రాగ మన సముగ్ర మగురీతిఁ

బోకువుఁగెంజాయ రంజిల్లు • పాలువుఁ గాంచెఁ
బ్రాక్పటంబున కొకవింత • వన్నె యిడుచు. ౨౨౯.

మ. బలభిత్ప్రోన్నతరత్నసౌధవలభీ • వ్యాలంబిరక్తచ్ఛదో
జ్జ్వలశారీకలధౌతపంజరముశే • వం దూరుపుంగొండపైఁ
బొలిచెన్ సోదయరాగలాంఛనపరి • స్ఫూర్తిం దుషారాంశుమం
డల మూర్ధప్రతిపాదిరశ్మిగణసం • ధానస్ఫురన్మూర్తియై. ౨౩౦.

శా. ఆరేయెల్లను మున్ను శంకరుని నా • ట్యం బంత భృంగీశుహా
స్యోగ్రప్రౌఢిమ మంత నందికృతసా • యొప్పారు గానక్రియా
సారస్యంబును బిమ్మట న్నపతిప • స్సంరంభకుంభప్రభం
సారూఢోక్తులు గాలయాపనము సే • య న్మిమ్మె నుండఁగాన్. ౨౩౧.

సీ. తొలికోడి తానయ్యె • మొలుఁగత్తిమూఁడు భం • గులఁ గుక్కుటేశుండు • కొనరి కూసె
నాలమందల కెల్ల • నధినేత తానయ్యె, పాంకంబుగా నంది • అంకె వైచెఁ
దీర్ఘంబుఁ దెచ్చుహ • స్తికిఁ బెద్ద తానయ్యె, లంబోదరుఁడు బృంహి • తం బొనర్చె
విహగంబులకు నెల్లఁ • బెద్ద దానై కుమా, రుని కేకి పిలుచ ని • స్స్వన మొనర్చెఁ

తే.గీ. దానలింగార్చకులకుఁ బ్రా • ధమికుఁడగుచుఁ, బాతరనిలుండు గేతనా • గ్రమున నున్న
ఘంట మ్రోయించె వందిమా • గధులు తామె, యగుచు భక్తులు పేర్కొని • రపుడు మమ్ము.

ఉ. అంతట భానుమంతుఁ డుద • యాచలరంగము నందుఁ దోఁచె న
త్యంతము రమ్యమైన యరు • ణాంగమునుం జతురాస్యవిభ్రమం
బెంతయు నొప్పఁగా భువన • సృష్టికి నున్నతి మించు భారతీ
కాంతుని వేషమొప్పఁగ జ • గజ్జనసభ్యులమ్రోల నొప్పగాన్. ౨౩౩.

కం. అంతటను గుక్కుటేశుఁడు, సంతసమున సముచితోప • చారమ్ముల మ
మ్మెంతయును గారవించి యొ, కింతయు భేదమ్ము లేని • హితము దలిర్పన్. ౨౩౪.

గీ. మమ్ములను బంపు నపు డయ్యు • మాధవుండు, కొమరసామిని రావించి • కొంతదవ్వు
సాగనంపించు మని పంప • నాగుహుండు, దోడరా నేగితిమి రాజ • దుర్గమునకు.

కం. అపు డాస్వపు డాయం జని, చెపుమా యుపమాక నుండ • శీఘ్రము గాఁగన్.
జపముం దపముం మఱుఁ గూ, ర్చి పరంతప! రాఁ దలంచి • చేసితి నాడే. ౨౩౬.

కం. వచ్చితి మదుపును ఋషులు, నిచ్చెద మమ్ముం బ్రియహితము • మిగుల చెలిమిఁ గతా

సచ్చరిత యనిన నమ్మహీభృచ్చంద్రుఁడు మాఱుమ్రొక్కి వినయించె నిటుల్.

శా. దేవా! తారకమంత్రతత్త్వము ప్రసాదించెన్ మదస్వామి నా
కీవే వేలుపువైనఁ గోర్కి లిడ రా వేయంచుఁ బ్రార్థించినన్
వేవేగం జనుదెంచి నీ దగు మనోభీష్టం బమోఘంబుగాఁ
గావించుం జుమి యంచుఁ దెల్పి మఱియుం గారుణ్యచిత్తంబునన్. ౨౭౮.

క. కలి శ్రీవేంకటరమణుఁడె, కలఁపఁగఁ బ్రత్యక్షదైవతం బటు గాన
న్దొలుత జప మితనిఁ గూర్చియె, సలుపుము నీవాంఛితము లొసఁగ నేతెంచున్.

క. కావున వేంకటరమణుఁడె, తావకవంశంబునందు దరతరములుగా
భూవరులఁ బ్రోచుచుండెడు, నావన మొనరింపు మనుచుఁ బ్రార్థింపు మనెన్ ౨౮౦.

గీ. తన్మహామంత్రమున కధిదైవతంబు, రాముఁ డీతండు వేంకటరమణుఁ డనుచు
భేద మెంచకు మాతఁడు విభవమూర్తి, దలఁపఁగా నీతఁ డర్చావతారమూర్తి.

క. నారదముని చెప్పిన యా, తీరున ధ్యానం బొనర్చితిని నే సాక్షా
త్కారం బొనరించితి వీ, వారీతిన్ భక్తవరద యవితథ్యవరదా. ౨౮౨.

క. కావున నలమేల్మంగా, దేవియు నీవలమితో మదీయాన్వయముం
బ్రోవఁగ నిందు వసింపుఁడు, దేవా ప్రతిన్పతి చెంతఁ దేజ మెలర్పన్. ౨౮౩.

క. అటు లైదువేలవర్షము, లటుపై నాచంద్రతారకార్కంబుగ స
ప్పటుబలుఁడు కుమారుఁడె, ప్పటి కప్పుడు నృపులఁ బ్రోవ వర మీవలయున్.

చం. అని యిటు లానృపాలమణి ప్రార్థనఁ జేయఁగ వాని నీవు కో
రినవరమిచ్చినార మని ప్రీతునిఁ జేసి కుమారు నింటికిన్
బనిచి సతీసమేతముగ వచ్చితి మిచ్చటి కేము నీతలం
చినగతి నయ్యెఁ గాద మునిశేఖర యంచు వచించి వెండియున్. ౨౮౫.

శా. నీ వా రాజకులావతంసమునకుం డెందంబునం బ్రీతిగా
శ్రీవంశప్రతిభాప్రతాపజయసౌశీల్యాదు లెంతేనిఁ బెం
పై వర్ధిల్లఁగఁ దారకంబు భవఘోరాంభోధినిస్తారకం
బో వాచంయమివర్య తెల్పితిఁ గదే యూహించి యుక్తంబుగాన్. ౨౮౬.

క. అందుల కేమును మోదముఁ, జెందితి మిఁక నేమి కోర్కులున్నవొ చెపుమా
డెందంబున సందేహముఁ, బొందక యని శౌరి వల్కె మునిముదితుండై. ౨౮౭.

క. స్వామీ! నిష్కాముఁడనగు, నే మిము నేమనుచుఁ గోర్కె • లివి యని యడుగం
గా మదిఁ దలంతు నైనను, మీమాటకు మేరమీఱ • మియు ననుచితమగుక్. ౨౯౮.

క. కావున నీయిరుతెఱఁగుల, నీవేళ నొనర్పఁ దగిన • దిద్దియె యనుచున్
భావమునందు వితర్కము, గావించుచునుందు భక్త • కల్యాణకరా. ౨౯౯.

గీ. అనిన నిష్కాము లగుతపో • ధనులు మున్ను
గడఁగువనులును లోకోప • కారమునకుఁ
గాద యలవడె నీవు న • కర్మ గణిఁ జేయ
రాద యన నాతఁడు మహాప్ర • సాద మనుచు. ౩౦౦.

క. జగములకుఁ బ్రీతిఁ జేయుట, జగన్నివాసునకుఁ బ్రీతి • సలుపుట యనుచున్
దగ మున్ని టిమునిగణ ము, ప్పగిదిం గావించుచుండ • వచ్చు నటంచున్. ౩౦౧.

సీ. దేవసేవనముఁ దైర్థికుఁడు గావింపఁగా, నరుగుచో స్మృతినోకిం • తైననడుమ
వదలించు నెఱిఁగిన • వాఁడు గావున మాని, తేవన దీక్ష నెం • తేవనమునఁ
జనుచుండఁ బ్రొద్దుగుం • కినఁనాఁటిరాతిరి, నడవి దా నివసించు • టాదిగాఁగ
స్వామి కంతయును వి • జ్ఞాపనంబొనరించి, తత్పిశాచత్వంబు • తలఁగఁ జేయు
తే.గీ. టొకటియుఁ గలిఁ గరాజక • న్యక త్రిలింగ, విభునిపట్టపుదేవిఁ గా • వించు టొకటి
యును మనంబునఁ గోర్కెలై • యున్న వెన్న, విన్నవించితి భక్తప్ర • సన్నహృదయ.

మ. అన శ్రీవేంకటనాయకుండు దరహా • సాంకూరరమ్యాస్యుఁడై
యను నప్పండితమాని వ్యాఘ్రముహతుఁడై • యట్లయ్యె నే నాఁడు యా
చనకై యేగుచువచ్చునప్పు డొగి మా • సంసేవనం బాచరిం
తు నటం చీగుడిఁ గాంచి మ్రొక్కెఁ జనె నీ • త్రోవన్ సుతాన్వితుఁడై. ౩౦౩.

గీ. మరల వచ్చునాఁడు • మముఁ గొల్వ లేదు మా, కొండవంకఁ జూడ • కుండ బండి
మైన డిగ్గఁడయ్యె • సూనుండు తెలిపిన, వినియు వినని యట్లు • వెడలు మనియె.

మ. వాని తనూజు పౌత్రుఁడు స్వ • వార్షికలబ్ధికిఁ బీఠికాపురా
స్థానికి వచ్చి నిన్నుఁ దగు • సత్కృతులం గని యింటి కేగువాఁ
డై నియమంబునం బదగ • యాజలమజ్జన మాచరించి య
చ్చోనెడఁ బిండదానము వి • శుద్ధమతిన్ స్వపితృప్రియంబుగాన్. ౩౦౪.

శా. దానం జేసియు నీవుఁ జేసిన తదుద్యద్వాఃప్లుతిం జేసియున్
వానిం బాసి తొలంగెఁ గ్రూరత యికం బైశాచకవ్యక్తి యు
ద్దానిం బాయు నటన్న బంధురనరాంతర్వారిపూరంబులం
దానం బాడిన వీఁడు వీనిసఖులుం ధన్యాత్ములౌదు ర్వడిన్. ౨౫౭.

గీ. అనిన నిపుడయే వచ్చెద నసుచు మౌని, వర్యుఁ డగ్రిరవరబహిర్వాసులైన
వాంద్ర నందఱ బంధురవారి ముంప, నంద ఱందుండి వెల్వడు నంతలోన,

కం. ఇంగాలము లగ్నిశిఖా,సంగంబున దీప్తి వడసి క్షణమాత్రములో
నంగారములయినట్టుల, పొంగారు మనోజ్ఞరూపములఁ గని వారల్. ౨౫౮.

కం. మునుపటి కొలంది ప్రాయము, మునుపటి కొలఁది యగురూపమును గని వారల్
మునుపటిగొన మొక్కుటిఁ గవ,రనఘుంబగు తత్సరోమహత్త్వంబనదే. ౨౫౯.

కం. నారదుఁ డచటనె యున్నటు, లారక్షకుఁడైన శౌరి నరసి తదాజ్ఞన్
వారికి నందఱ కపుడా, నారాయణుపాదపర్శనంబు ఘటించెన్. ౨౬౦.

గీ. దయనుగతపాపులయినయందఱను గాంచి, శౌరికరుణించి మీకల్మషములు వాసెఁ
బావనాకృతులైతిరి భవ్యులార, యనుచుఁ గ్రమ్మఱనమ్మౌని నరసి పలికె.

కం. కరుణం దారకమున ద్వ్యక్షరి నుపదేశింపు మీప్రజకు వెస వారుం
దురు సాంతానికలోకము, లిరవులుగా నిర్విచారవృత్తి దలిర్పన్. ౨౬౨.

మ. ఇఁక నక్కన్నె త్రిలింగదేశధరణీభృన్మౌళి దేశేరియా
నాకొ తాకుండు నెకో యటంచు మదిలో నొక్కింతసందేహ మూ
నకు మా రాజు నిజానురక్తను గుణజ్ఞుండౌటచేఁ బెండ్లి యా
డక వర్జించునె యిట్టిచుట్టముల వీడం జూచునే యెయ్యెడన్. ౨౬౩.

కం. ఎల్లియె యయ్యిరువురకును, దల్లంబుగఁ బెండ్లియగు నందే పయనంబై
తల్లి దనపరిజనములతో, నల్లునిపురిఁ జేర నరుగు నారయ మొదుటన్. ౨౬౪.

సీ. ఈముద్దుఁగొమ్మ మూఁడేండ్లప్రాయంబున, నుండ నిక్కొండపై నున్నదమ్మఁ
గొలువంగఁ బరిజనంబులతోడఁ దలిదండ్రు, లేతెంచి మాకు సంప్రీతిఁ జేయ
నంధ్రదేశేంద్రుపురంధ్రియా నిది యంచు, వరము మే మొసఁగంగఁ బడసి యీగు
వభు దంగరక్షకై యస్మదాకృతితోడి, కనకప్రతిమ దీనికంఠసీమ

తే.గీ. హారతరళంబుగాఁ గూర్చి• యరుగునంత, వత్సరంబున నగ్గజ•ధ్వజవిభుండు
వినయవతియందుఁ గలభాంకుఁ•డనెడి విభునిఁ, గనియె నీభద్రమతియను•కన్నె వెనుక

గీ. స్వాప మెప్పుడు నొప్పదు•సాంధ్యవేళ, ముక్తమూర్ధజులై నిద్ర•వోవఁ గూడ
దనుచు నిమ్ముద్దియ యెఱుంగ•కట్లొనర్చు, నంతనంతర మొదవె భూ•తాళిగవియ.

చం. అది యటు లుండ నిమ్ము సము•దారుఁ డమానుషబాహుశౌర్యుఁ డు
న్మదరిపుహారి వీరపుర•నాథుఁడు పుణ్యయశోభిధానుఁ డొ
ప్పిద ముగ నెల్లి భద్రమతిఁ • బెండిలి యౌ నిఁక వత్సరంబులో
హృదయ మెలర్ప మేము వసి•యింపఁగ నచ్చటి కేఁగఁగా వలెన్. ౨౬౭.

ఉ. తద్దయు నీవు లోకహిత•తత్పరతన్ మముఁ గొన్ని కోరి తిం
కద్దియు నేని గోర్కె గల • దేని ఘటింతుము వేఁడు మంచు నా
నద్దివిజేంద్రవందితు ద•యారసమానసు వేంకటేశ్వరుం
బెద్దయుఁ బ్రొద్దు కోర్కెలిడఁ • బేర్కొని యమ్ముని వల్కె నిమ్మెయిన్. ౨౬౮.

సీ. సుకవిసారస్వత•స్ఫురణంబు రసికాంత, రంగరంజకమై యె•సంగవలయు
నృపనయవ్యాపార • మేపార దాక్షిణ్య, మున జనావనవృత్తిఁ• బూనవలయుఁ
బర్జన్యుఁ డనుకూల • వర్షియై కర్షక, హర్షకరోత్కర్ష • నలర వలయు
జనపదంబులు సుభి•క్షంబులై తృణకాష్ఠ, జలసమృద్ధములుగాఁ• జెలఁగ వలయుఁ

తే.గీ. బ్రకృతిజనసంచయంబుఁ బ•రస్పరంబు, చెలిమి వాటించి పాడిమై• నెలమిగాంచి
కలిమిని వహించి పాఁడిపం•టల రహించి, రాజవిశ్వాసపరత చే•బ్రబల వలయు.

కం. అని ముని యాశాస్యము దెల్పిన విని గరుడాద్రివాసి • వేంకటరమణుం
డనుమోదంబున నిప్పని, కనుమతి గావింతు ననుచు • ననియెం గరుణన్.

సీ. బ్రహ్మవిద్యామహా • ప్రజ్ఞానిధిత్వంబు, దివిజేంద్రసదృశవై•భవసమృద్ధి
యదితికశ్యపసమా•నాపత్యయోగంబు, నంద్రినాయకకౌతు•కానురక్తిఁ
నారదప్రతిమాన•తారకజపసిద్ధి, ధూర్జటినిభభూత•దోషవృత్తి
హీనభూతాభసాం•తానికలోకాప్తి, వల్లవతుల్యకై•వల్యపదవి

తే.గీ. యేతదస్మత్ప్రభూతవి•ఖ్యాతమహిమ, సహితమహితకథావిన•శ్రవణపఠన
నిరతనిరతుల కొదవు మూ•నివర! వారలున్నెడల నీతలంచి న•ట్లుండుఁ జుమ్ము.

గీ. అడరు మునివాస మొంటి•మామిడి యనంగ, విప్రరాక్షసురావి రా•వికముపాడు
ద్విజుఁడు వార్చెద ననుగుంట•కేటగుంట, వల్లవులపల్లె గోపాల•పట్టనంబు.

శా. లోకానుగ్రహకాంక్ష నీగతిఁ గృపాళుండై మరున్మానికా
శ్రీకాంతుండు వరంబు లిచ్చి దని యించెం దాక్షిణ్యభూమీధవుం
స్తోకశ్రీమహిమంబు శౌనకముఖర్షుల్ ప్రీతిఁ బొందంగ వి
ద్యాకల్పుం డగుసూతుఁడుం దెలిపె నిట్లత్యంతమోదంబునన్. ౨౭౩.

మ. శుభసంధాయక శాలివాహనశకేషుశ్రోత్రహస్తేందు (౧౭౭౫) స
చ్ఛుభకృద్వత్సరచైత్రశుద్ధనవమీశుభ్రాంశుజాహంబునం
దు భవద్భావుక పాదమూలమున నెంతో భక్తి నర్పించితిం
బ్రభుతంగైకొని రామ యీకృతిఁ గృపం బ్రఖ్యాతి నొందింపవే. ౨౭౪.

కం. శ్రీరమ్యగుణస్తోమా! రారాజత్కీర్తికామ! రాజలలామా!
గౌరీసన్నుతనామా! తారకమంత్రార్థతత్త్వధామా! రామా. ౨౭౫.

శా. లంకారాజ్యనివేశితారిసహజశ్లాఘార్హబాహా నిరా
తంకప్రౌఢబలాబలా! హితహితార్థప్రేషితస్వర్ణస
త్పంకేరుట్సరపాలితోషిక నితాంతప్రీతరత్నాంగదా
లంకారద్వయదానమోదపరఖేలద్వాయుజాతాంగదా. ౨౭౬.

మానిని. శ్రీవిభవాస్పదశంఖరథాంగకచిహ్నమనోహరమంజుసదా
భావుకదేవులపల్లికులప్రభవద్విజపూజితభవ్యపదా!
రావుకులోత్తమరాజశిఖామణిరామధరావరనందనస
ద్భావకుమారమహీపతిసూర్యనృపాలముహుఃపరిపాలనధీ. ౨౭౭.

→ గద్యము. ←

ఇది శ్రీమద్రామనామపారాయణపరాయణాతిధన్య కౌండిన్యగోత్రపవిత్ర
దేవులపల్లికులపయఃపయోనిధికళానిధిసీతారామశాస్త్రిపౌత్ర వేంకట
కృష్ణశాస్త్రిపుత్ర తమ్మనాభిధానాంతర వేంకటకృష్ణశాస్త్రి
నామాగ్రజన్మ త్రిలింగదేశాగ్రజన్మ సుధీవిధేయ సుబ్బ
రాయ నామధేయ ప్రణీతంబైన మహేంద్ర
విజయం బను ప్రబంధంబు నందు
సర్వంబు
షష్ఠాశ్వాసము.
శ్రీరామార్పణమస్తు.